# Mahādevi Varma Geetalu

A Translation of great modern Hindi Poet
in telugu by CHAGANTI TULASI

ISBN : 978-93-5235-935-6

First Edition : 500 Copies, September 2015



Published by : CHASO SPHURTI

For Copies : Visalandhra Book House, All Branches,
Chaganti Tulasi, Paul Nagar, 3rd Street,
Vizianagaram - 535 003.
Mobile : 099633 77672.

Printed at : Print Point, Kodugantivari St., Vizianagaram-2.

e-book : www.kinige.com

Price : Rs.130/-
$ 5

# విషయసూచిక

# ముందుమాట

– చాగంటి తులసి

## మహా కవయిత్రి – మహాదేవివర్మ

**" 'పశ్య దేవస్య కావ్యమ్ నమమార నజీర్యతి'**

ఈశ్వర రచితమైన ఈ కావ్యాన్ని చూడు. ఇది ఎప్పుడూ పాతపడదు. ఎప్పటికీ నశించదు. ప్రకృతి ఈశ్వరుడి కావ్యం. ఈ రూపురేఖాకృతుల సృష్టి అతని అమరకృతి. నిత్య నవీనతమ కావ్యం.

కవికి కవితకూ ఈ గొప్పతనం ఉంది. ప్రతి కవి రచన గతిశీలమైనది అవాలి. మరణించేది కాకూడదు. పాతబడిపోకుడదు. నదీతీరాలు భిన్నమవగలవు గాని నదిని గతిశీలమైన దానిగా చేయడానికి అన్ని తీరాల దగ్గరా లోతు ఉంటుంది. అలా లేకపోతే అది నది కాలేదు.." అని చెప్పిన మహీయసి మహాదేవివర్మ గారు కవిత్వంలో ఎంతో లోలోతుల స్థాయిలను చేరుకున్న రహస్యవాద (మార్మికవాద) మహా కవయిత్రి.

**"వెతికాను నిన్ను వెతలో**

**వెతుకుతాను వెతను నీలో!"**

అని పాడే వెతల సామ్రాజ్ఞి మహాదేవిగారిని ఆధునిక మీరా అని అన్నారు. ఆవిడ కవితలో ప్రతీకాత్మకంగా ఉన్న 'నువ్వు' రహస్యంగా ఉంది. ఇది ఆధ్యాత్మిక భూమిక కలిగి ఉందా, లేదా అన్న చర్చ కూడా జరిగింది.

ఆవిడ మానవీయ జిజ్ఞాస పరిధిని దాటి వెళ్లలేక పోయారని ప్రొఫెసర్ జగదీస్‌గుప్తా గారు అభిప్రాయపడ్డారు.

"మీరా ఆధ్యాత్మిక సాధన అసందిగ్ధంగా భావించబడుతుంది. మహాదేవి సాధన కావ్యంలో హద్దులు మధ్య కనబడుతుంది. మీరా, మహాదేవిల్లో ఈ వ్యత్యాసం ఉందో లేదో పరిశోధకులు చేస్తే చేస్తారు కాని కావ్య రసికులు మహాదేవి కావ్య జగత్తులోని విరహపు శాశ్వత అనుభూతి చిత్రాలను ఒకదాని తర్వాత ఒక దానిని పొందుతూ ఆనందిస్తారు. ఆ చిత్రాలు ఆవిడ ఆసంతృప్తి లాగానే సంతృప్తిదాయకాలు.

కావ్య రసానందానికి పరిశోధకుల పిండిత సారాంశం అవసరంలేదు" అంటూ తమ అభిప్రాయాన్ని చెప్పారు వ్రజేశ్వరవర్మగారు.

మహాకవయిత్రి మహాదేవివర్మ జీవితాంతం ఈ ధరిత్రీ – మానవాళి – సమస్యలు – అన్నిటా జీవశక్తితో భాగస్వామిని అయిన కార్యశీలి. ఆవిడ గద్య సాహిత్యం, స్త్రీల అభ్యున్నతి కోసం ఆవిడ పడిన తపన, అన్నిటా అడుగడుగునా ప్రాసంగికత కనపడుతూనే ఉంటుంది.

**చెప్పమ్మా! ఇప్పుడు దేనిని చూడను!**
**విస్పారుతున్న మొగ్గలను చూడనా!**
**దప్పికతో తడి ఆరిన పెదవులనా**
**నీ శాశ్వత యౌవ్వన శోభను చూడనా**
**శిథిల జీవాలను చూడనా!**

అని అంటూ,

**నవ్వుతున్న నా అధరాలను కాదు,**
**లోకపు కన్నీటి–సరాలను చూడు!**
**తడిసిన నా కనుఱెప్పలు తాకకు**
**వాడిన మొగ్గలు చూడు!**
**నీవు నాలో ఉంటే నేడు నువ్వే 'నేనై'**
**విషాదపు ఘడియలు చూడు!**
**తడిసిన నా కనుఱెప్పలు తాకకు**
**చెదిరిన పూరేకలను చూడు!**

అని గొంతెత్తి పాడుతుంది మహాదేవి!

మహాదేవివర్మగారి ప్రతీకల్లో 'దీపం' ప్రధానమైనది.

ఆవిడ ––

**శాపమయవరాన్ని నేను**
**శలభమా**
**ఎవరికో చెందిన కటిక దీపాన్ని నేను!**

అంటుంది.

ఈ దీపం ప్రతీక గురించి ఆచార్య హజారీప్రసాద్ ద్వివేదిగారు వ్యాఖ్యానిస్తూ "భక్తిప్రపత్తులకు కొత్త భాష, విరహానికి, ఒంటరితనానికి అర్ధగౌరవం లభించాయి.

ఇది అపూర్వం. కాళిదాసు చెప్పిన 'నిర్వాత నిష్కంద దీపం', బౌద్ధంలో చెప్పిన జీవన ప్రవాహం, ఫారసీ సంస్కృతిలో ప్రముఖమైన భావ చిత్రం శలభాన్ని ఆకర్షించే దీపం రూపం -- ఈ రూపాలన్నీ మహాదేవి కవిత్వంలో ప్రాచీనమైనవీ నవీనమైనవి కూడా లభ్యమవుతాయి. అయితే అన్నిటికన్నా ఆవిడ 'దీపం' అపూర్వమైనది!" అని అంటారు.

ఇది సమర్పణకు ప్రతీక. విలక్షణమైనది. ఆత్మ నిర్మూలనాన్ని ద్యోతక పరిచేది. వెలుగుతూ మండుతూ ప్రియుని మార్గాన్ని ప్రకాశింపచేసే ఉల్లాసాన్ని సూచించేది.

**ముద్దు ముద్దుగా**
**వెలుగుము నా దీపమా!**
**యుగయుగాలు ప్రతిక్షణం ప్రతినిమిషాన**
**నింపుము వెలుగులు ప్రియుని మార్గాన!**

**చక్కదనపు సౌభాగ్య దీపమా!**
**నా జోరు జోరు ఊపిరులకు**
**ఆరిపోవుదునని జడియకుమా;**
**చెఱగు చాటున ఉంచినాను,**
**అతిమెత్తని కదలాడు కనుఱెప్పలతో!**
**సహజ సహజముగ**
**వెలుగుము నా దీపమా!**
***లఘుత్వ బంధనం మరి పరిమితే,***
***అనాదివి నీవు గణించకు ఘడియలు;***
***నాచక్షువుల అక్షయనిధుల నేత్రజలం***
***నింపుతాను నీ లోపల !***
**చెమర్చి చెమర్చి**
***వెలుగుము నాదీపమా!***

ఆవిడ తన దీపాన్ని సార్థకమైనదానిగా, మహత్తరమైన దానిగా భావిస్తారు. అది ఆరిపోతే సృష్టిలోని సమస్త వేదనారాజ్యం చీకటితో నిండిపోతుంది. ఆ దీపం ఆధారంతోనే చీకటిని గెలవాలనే సంకల్పం నిలిపి ఉంచుకుంటారు. ఈ దీపం సందర్భంలో సృష్టికర్త క్రూరత్వాన్ని కూడా ఆవిడ గుర్తుకు తెచ్చుకుంటారు.

ఆవిడ పలికిన ఈ గొప్ప పంక్తులు –

**చింత ఎందుకయ్యా**
**ఓ కలుకువాడా**
**కొండెక్కితే నా దీపం**
**అంధకారమయ్యేది**
**నీ వేదనారాజ్యమే!!**

ఆవిడకు దీపం ప్రతీక మిక్కిలి ప్రధానమైనది అయింది.

మహాదేవివర్మ గారు విశిష్ట చిత్రకారిణి. తన కవితలకు వర్ణచిత్రాలను, రేఖా చిత్రాలను వేసుకుని తన కావ్య గ్రంథాలని ప్రచురించారు.

చిత్రకళ పరిశీలన, కల్పనమీదా, కవిత భావాతిరేకం, కల్పన మీద ఆధారపడిన కళలుగా ఆవిడ అభిప్రాయపడ్డారు. చిత్రకారుడు ఒకసారి తయారైన మానసికచిత్రాన్ని చాలాకాలం తర్వాత కూడా చిత్రించగలుగుతాడు కాని కవి అలా చేయలేడు. అందుచేత ఆవిడ తనను తాను ఈ విధంగా విశ్లేషించుకున్నారు.

"నా గీతాలూ చిత్రాలు రెండింటి మేళనంలో ఒకే భావం ఉండడం ఎంత అనివార్యమో వాటి అభివ్యక్తీకరణల్లో అంతే భేదం ఉండడం స్వాభావికం. గీతాల్లో వివిధ రూపవర్ణ భావ ధ్వనులు కూర్చబడతాయి. కాని చిత్రాల్లో వీటి అన్నిటికి స్థానం ఉండదు. దాని వల్ల నా చిత్రం గీతానికి ఒక శిల్ప పీఠాన్ని మాత్రం ఇవ్వగలుగుతుంది. దాని సంపూర్ణత్వాన్ని పట్టి ఇచ్చే సామర్థ్యాన్ని కలిగి ఉండదు."

మహాకవయిత్రి, విశిష్ట చిత్రకారిణి మహాదేవి వర్మ గారి కవిత్వాన్ని ఆమె వేసిన వర్ణ చిత్రాలతో పాటు తెలుగు సాహితీలోకానికి అందజేయాలన్న తపనతో ఈ అనువాదం చేయడం జరిగింది.

ఇది గొప్ప కార్యమనీ, ఆవిడ కవిత్వాన్ని ఆనువదించి ఆమె వేసిన వర్ణచిత్రాలతో పాటు ప్రచురించవచ్చుననీ, ఎటువంటి అభ్యంతరం ఉండదని నాకు హామీ ఇస్తూ అవతారిక రాసిన గౌరవనీయులు డాక్టర్ బాలశౌరిరెడ్డి గారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను.

మహాదేవివర్మ స్వాప్నిక, కాల్పనిక ప్రపంచాన్ని దర్శింపచేస్తూ రసానుభూతిలో తడిసి ముద్దయి **'కన్నీటితో తుడిచిన వేదన మరక'** ను రాసిన వాడ్రేవు చినవీరభద్రుడు గారికి నా హార్దిక ధన్యవాదాలు.

పుస్తక ప్రచురణకు అవసరమైన అన్ని రకాలైన సదుపాయాలను కలగచేసి శ్రమ తీసుకున్న సాహితీ సోదరులు డాక్టర్ చింతకింది శ్రీనివాసరావు గారికి అంజలులు.

తెలుగుసాహితీ లోకపు రసజ్ఞత గణనీయమైనది. అభినందనీయమైనది. సందేహం లేదు. మహాదేవివర్మ గారి సంపూర్ణ సాహిత్యం చదవాలని హిందీ భాష నేర్చేసుకుందామన్నంత ప్రేరణ ఈ నా అనువాదం కలిగిస్తే నా కృషి ఫలప్రదమైనదని ఆనందిస్తాను.

# అపరాజిత

– డాక్టర్ బాలశౌరిరెడ్డి

మహాదేవివర్మ (1907–1987) ఆధునిక హిందీ యుగకర్తలలో విశేష ఖ్యాతి చెందిన కవయిత్రి, రచయిత్రి. ఛాయావాద, రహస్యవాద (భావ, కాల్పనిక) కవితా జగత్తులో భాసిస్తున్న ధ్రువతార. ఆమె పద్యకవితలోనే కాదు, గద్యానికి కూడా అపూర్వమైన వన్నెతెచ్చిన సాహితీమూర్తి. అంతేగాదు తన అనుభూతులకు ఆకారాన్ని రూపొందించిన విశిష్ట చిత్రకారిణి. ఆమె గొప్ప సంఘ సంస్కర్త. స్త్రీల ఔన్నత్యాన్ని చాటి చెప్పిన విదుషి. స్త్రీల అభ్యున్నతికి తన జీవితాన్ని ధార పోసిన మాతృమూర్తి. స్త్రీలు చక్కగా విద్యనభ్యసించాలని, పురుషులతో సమానంగా సమాజసేవతో పాటు దేశ సౌభాగ్యానికి కృషిచేయాలని అభిలషించేవారు. ఆమె మహిళల కోసం ప్రయాగ మహిళా విద్యాపీఠ్ స్థాపించి తద్వారా మహిళా లోకంలో ఎంతో చైతన్యం కలిగించిన సంఘ సేవకురాలు. క్లుప్తంగా చెప్పాలంటే ఆమె మహిళా పక్షపాతి. ఆనాటి సాంఘిక వైషమ్యాల పట్ల ఎంతగానో స్పందించి వాటి నిర్మూలనకు అహోరాత్రులు శ్రమించిన నారీమణి.

ఒకవైపు సాంఘికాభ్యుదయాన్ని ఆశిస్తూ ఆమె చేసిన రచనలు ఆనాటి సమాజికులను ఎంతగానో ఉత్తేజపరిచాయి. మార్మికవాద (రహస్యవాద) కవిత్వంలో ఆమె స్థూల – సూక్ష్మ చైతన్యాలను విశ్లేషించి వ్యాఖ్యానించిన తీరు ఆమె రచనా నైపుణ్యానికి గీటురాయి. అందుకే మార్మికవాద కవిత్వంలో కబీర్, గురుదేవ్ రవీంద్రనాథ్ ఠాగూర్ తర్వాత ఆమె తన స్థానాన్ని పదిలం చేసుకోగలిగారు.

జాతీయ కవి మైథిలీశరణ్ గుప్తా ఆమె కావ్య వైశిష్ట్యాన్ని ప్రస్తావిస్తూ వ్యక్తీకరించిన పంక్తులు స్మరించుకోదగ్గవి. "సహజంగా రెండు భిన్న రూపాల్లో వున్న మహాదేవి.. నాకు ఒకే రూపంతో లభించింది. సోదరీ..! చెప్పమ్మా! నిన్ను నేను సాహిత్యశారదా! అని పిలువనా? లేక కావ్యశ్రీవని పిలవనా?" మహాకవి నిరాలా నుంచి ఎంతో మంది కవులు ఆమె కావ్య ప్రతిభను, కావ్య సౌందర్యాన్ని విశ్లేషిస్తూ అనేక కవితలు చెప్పారు.

అంతేగాదు భారతదేశ ప్రథమ రాష్ట్రపతి డాక్టర్ బాబూరాజేంద్రప్రసాద్ నుంచి జయప్రకాశ్ నారాయణ్ లాంటి రాజకీయవేత్తలు కూడా ఆమె కవిత్వాన్ని

వేనోళ్ళ ప్రస్తుతించారు.

డాక్టర్ రాజేంద్రప్రసాద్ మాటల్లో చెప్పాలంటే.. "శ్రీమతి మహాదేవివర్మ ఒక గొప్ప కవయిత్రి మాత్రమే కాదు.. ఆమె భారతీయ మహిళల సంస్కృతికి ప్రతీక!"

పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ "మహాదేవిగారి కవిత్వం నన్నెంతగానో ఆకట్టుకుంది" అని అన్నారు.

డాక్టర్ రామ్‌మనోహర్ లోహియా ఒక అడుగు ముందుకువేసి భారతావనిలో మహాదేవి వచనరచన (గద్యం) సర్వోత్కృష్టమైనదని అన్నారు. జయప్రకాశ్ నారాయణ్ మహాదేవి చేసిన సంఘసేవకు ముగ్ధుడయ్యారు.

ఆమె వ్యక్తిత్వంలో గొప్పతనం, ఆత్మసౌందర్యం, దయాగుణం, ప్రతిభ సహృదయత్వం ప్రతిబింబిస్తోంది. కానీ అంతకుమించి తన కర్తవ్యపరాయణత్వంతో పాటు ఆమె గావించిన సంఘసేవ ఆమెను దేశంలోని గొప్ప రాజకీయ నాయకుల పంక్తిలో చేర్చగలదు. కానీ ఆమె ప్రచారానికి దూరంగా, అజ్ఞాత సంఘ సేవకురాలిగా నిలిచిపోయింది. అదే ఆమె వ్యక్తిత్వానికి వన్నెతెచ్చింది.

'సాహిత్యకార సంసద్' పేరిట సంస్థను స్థాపించి తద్వారా ఆమె సారస్వత ప్రపంచానికి చేసిన సేవ అపారం. అలాంటి కీర్తి శిఖరాలను సృష్టించిన మహా కవయిత్రి రచనలను తెలుగు పాఠకులకు పరిచయం చేయడం ఎంతైనా ముదావహం. మహాదేవి వర్మ చేసిన కొన్ని ఉత్తమ రచనలను ఎన్నుకొని డాక్టర్ చాగంటి తులసి తెలుగులోకి అనువదించారు.

తులసి మాతృభాష తెలుగు. జాతీయ భాష హిందీలోనే కాదు ఒడియా, ఆంగ్ల భాషల్లో కూడా మంచి ప్రవేశమే కాక ప్రావీణ్యం కూడా ఉంది. ఆ కారణం చేతే ఆమె అనువాదం మూలభావాల సౌందర్యాన్ని తెలుగులో ప్రత్యక్షీకరించడంలో సాఫల్యత సాధించింది.

హిందీ, తెలుగు భాషల నుడికారాన్ని తులసి చక్కగా ఆకళించుకున్నారు. ఆ కారణంగా ఆమె అనువాదాలు మూల కృతికి అనుగుణంగానే కాకుండా కొన్ని సందర్భాల్లో మాతృకకు అందం చేకూర్చేరీతి రచన కొనసాగుతుంది.

ఆమె అనువాదాలు చదువుతున్నప్పుడు నిజంగా మూల రచనే చదువుతున్న భావన కలుగుతుంది. ఆమె ప్రతిభాపాటవాలు అనువాద రచనల ద్వారా తెలుగు

పాఠకులకు చక్కగా అవగతమయ్యాయి. అనువాదమంటే సృష్టికి అనుకృతి.. అంటే కృతికి అనుకృతి.. ఈ భాషాంతరీకరణ ప్రక్రియ తెలుగులో ఆదికవి నన్నయ నుంచి ఈనాటి వరకూ నిరంతరంగా సాగుతోంది. ఆ క్రమంలో తులసి గేయానువాదాలు పాఠకుల హృదయాలను రంజింపచేయడంలో సఫలీకృత మయ్యాయి.

"సాంధ్య గీత్" శీర్షిక గేయాన్ని చాగంటి తులసి ఎంత నైపుణ్యంతో పరకాయ ప్రవేశం చేయగల్గారంటే, ఒక పర్యాయం చదివి చూడాలి.

మూలం :

**ప్రియ! సాంధ్యగగన్**
**మేరా జీవన్**

ఈ గేయాన్ని ఆమె తెలుగులో ఎలా రూపొందించారో దృష్టి సారించండి.

**ప్రియా!**
**సాంధ్య గగనం**
**నా జీవనం!**
..............................
..............................
**జగత్తు నుంచి నింపాదిగా**
**నింపుకు వస్తుంది – శ్వాస సమీరం,**
**స్మృతుల సుగంధం**
**జీవన మృత్యుతీరం సుగంధితం**
**రోమరోమం పులకితం**
**మొగలివనం!**

అలాగే జీవితం ద్వంద్వ ప్రకృతిమయం. సుఖదుఃఖాలు జీవితానికి అభిన్నమైన ప్రవృత్తులు. ఆ భావాన్ని తులసి చక్కగా తెనుగీకరించారు.

**సుఖదుఃఖాల విహంగాలు**
**ఈరోజు ఇంటి బాటపట్టాయి!**
**తుడిచివేస్తోంది తమం**
**నా స్థిర జాగృతిని**
**ఆ చిత్రిత మార్గం ఈ దినం**

**జారుకుంది చాటుకి**
**దిగిరా! ఇక ఇప్పుడు**
**తెప్పలపయికి**
**ఓ అతిథీ!**

అలాగే,

**నా అడుగడుగునా నిండి ఉంది సంగీతం**
**రాలుతుంది శ్వాసలో స్వప్న పరాగం**
**నభో నవ వర్ణాలు నేస్తాయి పచ్చడం**
**ఛాయలో పెంపొందుతుంది మలయమారుతం**

తన అస్థిత్వాన్ని అజ్ఞాతంగానే వుంచాలనే కోరిక ఎంత బలవత్తరమైనదో ఆ భావాన్ని రచయిత్రి ఈ పంక్తులలో చక్కగా పొదిగారు.

**ఉండనీ మార్గాన్ని అపరిచితంగా**
**ఉండనీ ప్రాణాన్ని ఒంటరిగా**

అలాగే జీవబ్రహ్మల అనుబంధాన్ని ఐక్యతను ఎలుగెత్తి చాటుతూ మహాదేవివర్మ రచించిన "బీన్ భీ హుం తుమ్హారీ రాగినీ భీ హుం" గేయాన్ని తులసి చాలా చక్కగా అనువదించారు.

**వీణనీ నీ రాగ రాగిణినీ**
**అణువణువున అచలనిశ్చేష్ట నిద్ర నాది**
**జగత్తు ప్రథమ స్పందన యందు ప్రథమ జాగృతి నాది**
**ప్రళయంలో ఉంది నా జాడ**
**పథచిహ్నంలో ఉంది జీవనం**
**ఉన్నాను దూరంగా నీకు**
**అయినను అఖండ సౌభాగ్యవతిని**

'తూ ధూల్ భరా హీ ఆయా!' గేయాన్ని చక్కటి చిక్కటి తెలుగు నుడికారంలో అనువదించిన సరళి వాస్తవంగా అచ్చ తెలుగు జానపదశైలిని మరిపిస్తుంది.

**దారిబత్తెం లేకుండా వదిలేసాయి**
**అన్ని కలలు**
**కంచికి వెళ్లకుండా నా ఒడిలోనే వుండిపోయాయి**

**అన్నికథలు**
**అదిగో అప్పుడు సైగతో పిలిచాయి**
**ఆ చేలాంచలాలు**

**'మధుర మధుర మేరా దీపక్ జల్'** గీతాన్ని అనువదించిన రీతి పాఠకులను ఎంతైనా ఆకట్టుకుంటుంది.

**ముద్దుముద్దుగా వెలుగుము నా దీపమా!**
**యుగయుగాలు ప్రతిదినం ప్రతిక్షణం**
**నింపుము వెలుగులు ప్రియుని మార్గాన**

అలాగే,

**పులకరించి పులకరించి**
**వెలుగుము నా దీపమా!**
**అడుగుతున్నాయే అఖిలము**
**జ్వలనకణాన్ని**
**తలయెత్తుకొని 'దగ్ధమవలేకపోయానే!**
**అయ్యెయ్యో నీతో కలసి' అంటోందే విశ్వ శలభం!**

అనువాదంలో మూల రచయిత అనుభూతులని చక్కగా ఆకలింపు చేసుకొని అదే శైలిలో భావస్ఫోరకంగా వ్యక్తీకరించడం ఒక కళ. ఆ కళలో నిష్ణాతురాలైన డాక్టర్ తులసి అనువాదం నిజంగా తెలుగుభారతికి ఒక అలంకారం. ఆమె హిందీ, తెలుగు భాషల్లో అనేక రచనలు చేసి అనువదించి ఉభయ భాషల పఠితలకు ఆయా భాషల సౌందర్యాన్ని, మాధుర్యాన్ని పంచిపెడుతున్నారు. అందుకు ఆమె ఎంతైనా అభినందనీయురాలు. ఇలాగే భవిష్యత్తులో కూడా ఆమె ఉత్తమ రచనలను అనువదించి ఉభయ భాషల వివేకానికి, ఔన్నత్యానికి. సమృద్ధికి తోడ్పడగలరని మనసారా వాంఛిస్తూ ఈ గ్రంథ రచనకు ఆమెను మరీమరీ అభినందిస్తున్నాను.

**– బాలశౌరిరెడ్డి**

"జ్యోతి నికేతన్"
26 వడివేలుపురం
వెస్ట్‌మాంబళం
చైన్నై – 600033
సెల్ : 09962113178

# కన్నీటితో తుడిచిన వేదన మరక

– వాడ్రేవు చినవీరభద్రుడు

మహాదేవి వర్మ గీతాల్ని తాను తెలుగు చేసాననీ, ఆ అనువాదాల్నీ, ఆమె చిత్రలేఖనాలు కొన్నింటినీ కలిపి పుస్తకంగా తేవాలనుకుంటున్నాననీ చాగంటి తులసిగారు చెప్పినప్పుడు నేను మొదట ఆశ్చర్యపోయాను. ఆ పుస్తకానికి నన్నొక పరిచయవాక్యం రాసిమ్మని అడిగితే నాకేమనాలో అర్థం కాలేదు. డా.బాలశౌరి రెడ్డిగారు ఆ పుస్తకానికి అవతారిక సిద్ధం చేసారని కూడా ఆమె చెప్పినప్పుడు నేనింక అదనంగా రాయగలిగేదేముంటుందనిపించింది.

కాని ఆ పుస్తకం నాకు అందినప్పణ్ణుంచీ అందులో ఏ ఒక్క గీతం తెరిచినా ఒక అపురూప మార్మిక జగత్తులోకి తలుపు తెరిచినట్లే ఉండి, నేనేమీ రాయలేక పోయాను. అన్నిటికన్నా ముందు ఆ కవయిత్రి నిర్మించుకున్న స్వాప్నిక, కాల్పనిక ప్రపంచమెట్లాంటిదో నాకై నేను ఒక పట్టాన పోల్చుకునే ప్రయత్నంలోనే నెలల తరబడి గడిపేసాను.

నేను హిందీ పండితుణ్ణి కాను. కాని హైస్కూలు రోజుల్లో మా మాష్టారు హీరాలాల్ కామ్లేకర్ గారు నాతో ఆధునిక హిందీ కవుల్ని స్వయంగా చదివించారు. జయశంకర్ ప్రసాద్, సుమిత్రానందన్ పంత్, నిరాలా, బచ్చన్ వంటి కవుల్ని చదివించినప్పుడు ఆయన ఎందుకనో మహాదేవి వర్మను మాత్రం నాకు పరిచయం చెయ్యకుండానే వదిలిపెట్టేసారు. తర్వాత రోజుల్లో కబీర్, మీరా, తులసీ, సూర్ దాస్‌లను నేను స్వయంగా అధ్యయనం చేసినప్పటికీ, మహాదేవి వర్మను చదవకుండా హిందీ సాహిత్యాధ్యయనం పూర్తికాదని ఈ సంపుటి చదివాకే గ్రహించాను.

ఈ గీతాలన్నీ నాకై నేను ఎన్నో మార్లు పునఃపునః పఠించాక, ప్రతి గీతంలోనూ దాగిఉన్న అజ్ఞాతసాగరతీరాల్లో తచ్చాడినంత సేపు తచ్చాడాక మళ్ళా బయటకు రాగానే కల చెదిరిపోయినట్టుగా, చూస్తూండగానే ఋతువు గడిచిపోయినట్టుగా ఆ కవిత మనసుకి అందినట్టే ఉండి అందకుండా దాటిపోతూ ఉంది.

నేనీ కవితల్ని పట్టుకుపోయి కర్నూల్లో మా మాష్టారి దగ్గర కూచుని చదువుకోవాలనుకున్నాను. కానీ కుదిరింది కాదు.

చివరికి ఒక సాయంకాలం ఆయనకు ఫోన్ చేసి మహాదేవి వర్మ కవిత్వం గురించి మీరేదన్నా చెప్తే వినాలనుకుంటున్నానన్నాను.

'మహాదేవివర్మనా! మై నీర్ భరీ..' అంటూ 'ఇదిగో, మా అమ్మాయి లక్ష్మి చెప్తుంది విను' అని ఫోన్ వాళ్ళమ్మాయి లక్ష్మి చేతికిచ్చేసారు.

లక్ష్మి ఫోన్ అందుకుని 'నాన్న ఆ వాక్యం పూర్తిగా చెప్పలేక నన్ను చెప్పమంటున్నారన్నయ్యా, మై నీర్ భరీ దుఃఖ్ కీ బదలీ, అదీ ఆ వాక్యం' అన్నదామె.

ఆ ఒక్క మాటతో, తన గొంతు గద్గదమవుతూ, ఆ వాక్యం పూర్తి చెయ్యలేని ఆ రసోన్మత్తతతో ఆయన తడబడుతుండగా మహాదేవి వర్మ అంటే ఏమిటో నాకు పూర్తిగా అర్థమయింది. ఒకప్పుడిట్లానే మా మాష్టారు మల్లంపల్లి శరభయ్యగారు రామాయణమహాకావ్యం గురించి మాట్లాడుతూ, సీత అగ్నిప్రవేశ ఘట్టం దగ్గరికి వచ్చేటప్పటికి, గొంతు గద్గదమవుతూ అతి కష్టం మీద గొంతు పెగుల్చుకుని 'అగ్ని ప్రవేశం చేసింది సీత కాదు, రాముడే' అని చెప్తూ కళ్ళనీళ్ళ పర్యంతమైన దృశ్యం గుర్తొచ్చింది.

మహాదేవి వర్మ కవిత్వమంతా అటువంటి అగ్నిప్రవేశానుభవం. ద్రవీభూత మనస్థితి.

ఒకప్పుడు చైతన్యమహాప్రభువు నవద్వీపంలో నడుస్తూండగా ఎవరో అదిగో ఆ బాజాలవాళ్ళు ఫలానా చోటునుంచి వచ్చారని అంటున్న మాటవినగానే స్పృహ తప్పిపోయాడని రామకృష్ణ పరమహంస ఒకచోట గుర్తు చేసుకుంటారు. బాజా అన్నమాటవినగానే అది సంగీతాన్నీ, సంగీతం వేణువునీ, వేణువు చిన్నికృష్ణుణ్ణీ జ్ఞాపకం చేసి కృష్ణస్మరణతో చైతన్యులు స్పృహ కోల్పోయారన్నమాట.

మహాదేవి వర్మ కవిత్వం అటువంటి స్మరణానుభవం, తీవ్రరసానుభవం.

## 2

**ఈ** గీతాల్లో ప్రతి ఒక్క పదం వెనకా, పదసంయోజన వెనకా అవ్యక్తమానసిక సంచలనాలు కెరటాల్లాగా ఎగసిపడుతుంటాయి. ఒక సన్నజాజిపూల రేకు ఒక శ్రావణమేఘాన్ని గుర్తు తెచ్చినట్టు, ఒక పారిజాత పుష్పం ఒక శారదకౌముదీ మహోత్సవానికి ప్రతీకగా నిలిచినట్టు, ఒక మొగలిరేకులో మనమొక మేఘసందేశ కావ్యాన్ని చదవగలిగినట్టు, ఇందులో ప్రతి ఒక్క పదం, శబ్దప్రయోగం, అర్థచ్ఛాయ మనల్నొక అలౌకిక ప్రపంచంలోకి తీసుకుపోతుంది.

కవిత్వమంటే ఏమిటని ప్రతి కాలంలోనూ ప్రతి కవీ తనకు తాను ప్రశ్నించుకుంటూనే ఉన్నాడు. కవిత్వమంటే శబ్దాలంకారం, అర్థాలంకారం, ధ్వని

అని బహువిధాలుగా భారతీయ సాహిత్యవేత్తలు వివేచించే ప్రయత్నం చేసారు. ఆధునిక పాశ్చాత్య కవిత్వం కూడా అనేక నిర్వచనాల్ని దాటుకుంటూ ప్రస్తుతం మెటఫర్ దగ్గర ఆగింది. ఒక జీవితానుభవానికీ, మరొక జీవితానుభవానికీ మధ్య సాదృశ్యం చూపడం ద్వారా ఆ జీవితానుభవాన్ని మరింత సుసంపన్నంగా, ప్రగాఢంగా అర్థం చేసుకోవడానికి కవిత్వం దారిచూపుతుందని ప్రపంచమంతటా కవులు నేడు భావిస్తున్నారు. కవిత్వం అనువాదానికి లొంగదు కాబట్టి, అనువాదంలో నష్టమయ్యేదే కవిత్వమనే భావనస్థానంలో అనువాదాన్ని దాటి ఏది బతుకుతుందో అది మాత్రమే కవిత్వమని నేడొక కొత్త ఆలోచన ప్రచలితమవుతున్నది.

కాని పాల్ వెర్లేన్ కవిత్వాన్ని ఫ్రెంచిలోనూ, హాఫిజ్ గజళ్ళను పారశీకంలోనూ, ఫైజ్‌ను ఉర్దూలోనూ, శ్రీశ్రీని తెలుగులోనూ మాత్రమే ఆనందించగలమనేది కూడా కాదనలేని యథార్థం. అందుకు కారణం వాళ్ళ కవిత్వంలో శబ్దానికున్న ప్రాధాన్యం మాత్రమే కాదు, అక్కడ శబ్దం సాహిత్యస్థాయిని దాటి సంగీతస్థాయికి చేరుకోవడం మరీ ముఖ్య కారణం. అందుకనే ఇంగ్లీషు వ్యాసకర్త వాల్టర్ పీటర్ all art constantly aspires to the condition of music అని అన్నాడని యూరోప్ పదే పదే గుర్తు చేసుకుంటూ ఉంటుంది.

మహాదేవి వర్మ కవిత్వం కూడా అటువంటి సంగీతాత్మకతను, రాగాత్మకతనూ, నాదాత్మకతనూ సంతరించుకున్న సరళి. ఆ పదజాలంలోనే ఒక అవ్యక్త సంగీతముంది. 'పాథేయహీన స్వప్నాలు', 'నీరదసమశరీరం', 'నభగంగా రజతధార', 'మృదు అంజన దుకూలం', 'క్రేంకార నూపుర నాదం', 'ఛాయాసమవీతరాగదేహం', 'స్వప్నప్రియమేఘం', 'సుగంధిత జీవనమృత్యుతీరం', 'స్వప్న శతదళం', 'లాస్య తన్మయ శంపాలత ', 'ద్రుత చరణాల అంక సంసృతి' వంటి పదాలు, పదబంధాలు మనలో జాగృతపరిచే సూక్ష్మలోకాలు సంగీతానికి మాత్రమే సాధ్యమయ్యేవి.

కానీ ఈ అక్షరవిద్య కొత్తది కాదు, భారతీయమహాకవులందరికీ ఈ రహస్యం తెలుసు. వాల్మీకి ఋతువర్ణనల్లో కనిపించే ఈ స్వర్ణవిద్యనే కాళిదాసు కొల్లగొట్టుకొని మహిమాన్విత కావ్యభాషను రూపొందించుకున్నాడు. నన్నయ తెలుగును కావ్యభాషగా మారుస్తూ దీన్నే 'అక్షర రమ్యత' అన్నాడు. టాగోర్ గీతాంజలి గీతాల్ని ఇంగ్లీషు వచనంగా మార్చినా, ఆ వచనాన్ని మరెన్ని భారతీయభాషల్లోకి అనువదించినా నష్టపోకుండా మన హృదయాల్ని చేరవచ్చేది ఆ సంగీతమే.

కాని తక్కిన మహాకవులకీ, మహాదేవివర్మకీ ఒక తేడా కనిపిస్తున్నది. వాల్మీకి, కాళిదాసు, తులసీదాస్, తుకారాం వంటివారు తమ సంగీతాన్ని తమ ఉపదేశానికి

ఆనుషంగికం చేసారు. నన్నయ కేవలం అక్షరరమ్యతతోనే ఆగిపోకుండా, 'ప్రసన్న కథాకలితార్థ యుక్తి', 'నానారుచిరార్థ సూక్తినిధి' కూడా తన కవిత్వంలో వున్నా యన్నాడు. కాని మహాదేవి వర్మ తన కవిత్వానికి అటువంటి బరువుని ఆపాదించు కోలేదు. ఆమె కవిత్వం పూర్తి సంగీతం. ఏ హిందూస్తానీ గాయకుడో, పండిట్ ఓంకార్‌నాథ్ ఠాకూర్ వంటివాడు గానం చేస్తూ, చేస్తూ, రాత్రి మలిజాములు గడిచేవేళకు గానాలాపనలో 'కౌన్ గలీ గయో శామ్' అన్న ఒకే ఒకే వాక్యాన్నే పదే పదే ఆలపిస్తో తనను తాను మైమరిచినట్టుగా మహాదేవి వర్మ కవిత్వం కూడా అటువంటి రసమయ ఆలాపన. సంగీత సాహిత్యాల హద్దులు చెరిగిపోయిన అనుభవం.

ఇక్కడ సంగీతమంటే శ్రావ్యంగా ఉండేదన్న అర్థంలో కాదు. మనం సంగీతాన్ని వినేటప్పుడు బుద్ధిని విస్మరిస్తాం. మనం వింటున్నదాన్ని వివేచించి ఆనందించవలసిన పనిలేదక్కడ. అది ఆపాతమధురం. మనం వింటున్నదేదో సరాసరి మన హృదయంలోకీ, రక్తం లోకీ నేరుగా ప్రవేశించి మనల్ని పరిశుద్ధం చేస్తుంది, కొత్త రక్తం నింపుతుంది.

సాధారణంగా సాహిత్యానుభవం అట్లా ఉండదు. అది ఆలోచనామృతం. ఆలోచించేకొద్దీ మనకు కొత్త భావనల్ని, కొత్త సత్యాల్నీ అందిస్తూ మననీయ రమణీయంగా ఉంటుంది.

కానీ తనకు అనుభవమవుతూ, తనను సున్నితంగా వేధించే జీవన లాలిత్యాన్నో, లోకకాఠిన్యాన్నో అనుభవమయిందాన్ని అనుభవమయినట్టుగా సూటిగా చెప్పుకోగలిగే అవకాశం అందరు కవులకీ రాదు. అట్లా చెప్పగలిగే కవిని ద్రష్ట అంటాం. అలాకాక తన అనుభవాన్ని conscious గా ఒక కవితగా నిర్మించే కవిని స్రష్ట అంటాం. మహాప్రస్థాన గీతాలు రాసినప్పుడు శ్రీ శ్రీ అట్లాంటి ద్రష్ట. ఎమిలీ డికిన్ సన్, విలియం బ్లేక్ అట్లాంటి ద్రష్టలు. జీవితమంతా గీతాల మాలలల్లుతూ గడిపిన టాగోర్ శబ్దాల్లోంచి సుశబ్దాన్ని ఏరవలసిన బాధ్యత భరించలేకనే యాభై ఏళ్ళుదాటాక చిత్రకారుడిగా మారాడు.

కాని మహాదేవి వర్మ ముందే చిత్రకారిణి, ద్రష్ట. 'ముత్యపు జలం', 'స్వర్ణ రజం' , 'విద్రుమ వర్ణం' మేళవించి తన మనోచిత్రాల్ని గీతాలుగా రూపొందించింది. ఒక భాషలో ఇట్లాంటి అదృష్టం ఏ కవికోగాని దక్కదు.

## 3

**19**వ శతాబ్ది ఉత్తరార్థం నుంచీ భారతీయ రచయితల్నీ, కవుల్నీ ఇంగ్లీషు సాహిత్యమూ, పాశ్చాత్య సాహిత్యమూ ప్రభావితం చెయ్యడం మొదలయ్యాక, వివిధ భారతీయ భాషల్లో ఆధునిక సాహిత్యం మొదలయిందని మనకు తెలుసు. 20వ శతాబ్ది ప్రారంభంలో దాదాపుగా అన్ని భాషల్లోనూ రొమాంటిసిజం ప్రభావంతో కాల్పనిక కవిత్వం రకరకాల పేర్లతో వికసించిందని కూడా మనకు తెలుసు. హిందీలో ఛాయావాదం పేరిట తలెత్తిన రొమాంటిసిస్టు కవిత్వంగానే మహాదేవి వర్మ కవిత్వం మొదలయినప్పటికీ, అది కాల్పనిక ధోరణితో ఆగకుండా మిస్టిక్ ధోరణుల్ని సంతరించుకుందనేది విమర్శకులంతా అంగీకరించిన విషయం. కాని ఆమె కవిత్వం మార్మికతనూ, రహస్యఛాయనూ సంతరించుకుందంటున్నప్పుడు ఆ ధోరణుల్లో కూడా ఒక అద్వితీయతను చూపించిందని గుర్తించాలి.

యూరోప్‌లో రొమాంటిసిజంలో మిస్టిసిజం అంతర్లీనంగా కొనసాగుతూనే ఉంది. ప్రసిద్ధ ఇంగ్లీషు రొమాంటిసిస్టు కవులు వర్డ్స్ వర్త్, షెల్లీ, కీట్స్, కాలరిడ్జ్, బ్లేక్‌ల కవితల్లో, ఉత్తరాల్లో చాలాచోట్ల మార్మికతను అందుకున్న వాక్యాలు కనిపిస్తాయి. అందుకు రెండు కారణాలున్నాయి.

మొదటిది, యూరోప్‌లో కవులు, సాహిత్యవేత్తలు సబ్లైమ్‌ని అన్వేషించే వాళ్ళుగా ఉండటం. Sublime కీ, Beautiful కీ తేడా ఉంది. బ్యూటిఫుల్ అంటే ఆహ్లాదకరమైన సౌందర్యం. సబ్లైమ్ భీకరసౌందర్యం.

సబ్లైమ్ ఎదుట మనిషి భీతావహుడవుతాడు. దాన్నుంచి కొంత ఎడంగా వుండి మటుకే దాన్ని ఆలోకించాలనుకుంటాడు. సబ్లైమ్ పురుష ప్రకృతి, బ్యూటిఫుల్ స్త్రీ ప్రకృతి. ఫ్రెంచి విప్లవంతో మొదలైన స్వేచ్ఛాభిలాష రొమాంటిసిజంగా మొదలయినప్పటికీ, ఆ కవుల్లో, రచయితల్లో, చిత్రకారుల్లో, కళాకారుల్లో అంతర్లీనంగా ఉన్న సౌందర్యపిపాస సబ్లైమ్ గురించి అన్వేషణగా వికసించి రొమాంటిసిజం డార్క్ రొమాంటిసిజంగా మారిపోయింది.

రెండవది, రొమాంటిసిజం కావడానికి దక్షిణ యూరోప్‌లో, ముఖ్యంగా ఇటలీనుంచే పుట్టినప్పటికీ దానిమీద పారశీక కవిత్వ ప్రభావం, సూఫీ సాహిత్య ప్రభావం తీవ్రంగా ఉంది. సూఫీలు ఉన్మత్తతతో గానం చేసిన ఈశ్వరపిపాస రొమాంటిసిజంలో అంతర్లీనంగా కొనసాగుతూనే ఉంది. కాని ఐరోపీయ రొమాంటిసిజం ప్రధానంగా లౌకిక ధోరణి కాబట్టి రొమాంటిసిస్టు కవులు సూఫీల్లాగా

ఈశ్వరుణ్ణి నేరుగా కోరుకోకుండా తక్కిన ఈశ్వరీయ ప్రణయావస్థలన్నింటినీ, అంటే, ప్రేమ పిపాస, ప్రకృతి ఆరాధన, విరహం, ఉన్మత్తత, ఆత్మనిర్మూలన, సర్వసమర్పణ మొదలైనవన్నీ కోరుకున్నారు. కొన్ని కొన్ని సార్లు ఆ కవులు క్రైస్తవ మిస్టిసిజం ప్రభావానికి లోనయినప్పుడు విలియం బ్లేక్ లాగా ఈశ్వరుణ్ణి కూడా కోరుకోవడంగా పరిణమించింది.

రొమాంటిసిజం ప్రభావం భారతీయ కవిత్వం మీద పడ్డప్పుడు అది మొదట్లో చూడటానికి ప్రేమకవిత్వానికి దారితీసినట్టు కనిపించినా అంతర్లీనంగా మూడు ముఖ్య పరిణామాలకు దారితీసింది. మొదటిది, అది ఆధ్యాత్మిక భారతదేశంలో లౌకిక, ఐహిక, నవ్య భారతదేశాన్ని మేల్కొల్పే కవిత్వాన్ని ప్రోత్సహించడం. తరువాత తరువాత అదే దేశభక్తి, జాతీయవాద కవిత్వంగానూ, మరికొంత కాలం గడిచాక సామ్యవాద భావాలుండే అభ్యుదయ కవిత్వంగానూ వికసించింది. బంకింబాబు, గురజాడ, శ్రీశ్రీలు ఈ దారిన నడిచిన కవులు. రెండవది, అందులోని మిస్టిక్ ఛాయల్ని భారతీయ భక్తి కవిత్వంతో పోల్చుకుని సూఫీ తరహాలో ఒక ఈశ్వర ప్రణయ కవిత్వంగా వికసించడం. ఆ ఈశ్వరుడు సగుణుడు కావచ్చు, నిర్గుణుడు కావచ్చు. ఇరవయ్యవశతాబ్దపు భారతీయమహాకవులు చాలామంది ఈ తరహా కవిత్వం చెప్పినవాళ్ళే. టాగోర్ వీరికి ప్రతినిధి.

కాని మూడవ ధోరణి ఒకింత ప్రత్యేకమైంది. ఈ కవులు రొమాంటిసిజం ప్రభావం వల్ల సబ్లైమ్‌ని కోరుకున్నప్పటికీ, ఆ సబ్లైమ్‌కి నామరూపాలివ్వడానికి ఇష్ట పడలేదు. తాము తపిస్తున్న, తమని జ్వలింపచేస్తున్న ఆ మహాన్వేషణను దేశంతోనో, దైవంతోనో, ప్రేయసితోనో, ప్రణయంతోనో పోల్చుకోలేకపోయారు. తమని నిలవనివ్వని ఆ తీవ్రానుభవాన్ని వాళ్ళు ఐహికమూ చేయలేకపోయారు, ఆముష్మికమూ చెయ్యలేకపోయారు. తొలితరం కవులందరిలోనూ ఈ తీవ్రత సామాన్యమే అయినప్పటికీ ఆ కవులు ఒక బంకిం లాగా దేశం దగ్గరో, ఒక టాగోర్ లాగా ప్రకృతి దగ్గరో, ఒక కృష్ణశాస్త్రిలాగా ఊర్వశి దగ్గరో ఆగిపోయారు. కాని ఈ మూడవతరహా కవులు అట్లా ఆగలేకపోయారు.

నేను అర్థం చేసుకున్నంతవరకూ మహాదేవి వర్మ మూడవ తరహా రొమాంటిసిస్టు-మిస్టిక్ కవయిత్రి. ఆమె తన జ్వలనానుభవానికి స్పష్టమైన రూపురేఖ లివ్వడానికి ఎప్పుడూ ప్రయత్నించలేదు. అలా రూపురేఖలివ్వడమంటే తన సబ్లైమ్‌ని ఒక విగ్రహంగా మార్చడమేనని ఆమెకి తెలుసు. అందుకనే ఆమెను మీరాతో

పోల్చలేం. మీరా తాను దర్శించిన సబ్లైమ్ గిరిధరగోపాలుడేనని పదేపదే చాటిచెప్తూ వచ్చింది. కాని మహాదేవి అటువంటి మూర్తి నిర్మాణానికి ఎక్కడా పూనుకోలేదు. చివరికి ఆమె కవితల్లో పదే పదే కనవచ్చే దీపాన్ని చూసినా కూడా ఆ దీపకళిక కూడా నిశ్చలంగానూ, నిర్వాతంగాను వెలిగేది కాదు. 'ముద్దుముద్దుగా వెలుగుము నా దీపమా' అన్న గీతమే చూడండి: అందులో ఆమె ఆ దీపం 'ముద్దు ముద్దుగా', 'పులకరించి, పులకరించి', 'నవ్వి నవ్వి', 'అలుముకుని, అలుముకుని', 'చెమర్చి, చెమర్చి', 'మత్తిల్లి, మత్తిల్లి' కనిపిస్తుంది.

ఆమె తన దర్శనాన్ని ఎక్కడా స్థిరీకరించడానికి, ప్రామాణీకరించడానికీ, ఒక మూసలో పోతపొయ్యడానికీ ఇష్టపడనట్టే కనిపిస్తుంది. ఆమె అనుభూతి ఎక్కడా ఘనీభవించదు. అదే టాగోర్ ని చూడండి, ఆయన చూస్తున్న సర్వేశ్వరుడు ఏ రూపంలోనైనా సరే, ఒక పద్మంలానో, ఒక దక్షిణపవనంలానో కనిపించడానికి వువ్విళ్ళూరుతుంటాడు. కాని మహాదేవి వర్మ ఒక మేఘాన్నో, ఒక జలజాతాన్నో వర్ణించినప్పుడు కూడా ఆ మేఘం కదిలిపోతూనే ఉంటుంది, కరిగిపోతూనే వుంటుంది, ఆ జలజాతం లీలా కమలంగా మారిపోతుంది. ఈ అస్పష్ట, అనిశ్చిత, అవ్యక్త లక్షణాలవల్లనే ఆ కవిత్వం అంత సంగీతభరితంగానూ, వర్ణమయంగానూ గోచరిస్తుంది.

తనను నిలవనివ్వని ఈ జీవితస్పృహకు ఒక శాశ్వత రూపాన్నివ్వకపోవడంలో ఈమె మీద బౌద్ధం ప్రభావముందనుకోవచ్చు. తన అనుభూతికి ఒక స్థిరరూప మివ్వడమంటే అందులో సంచలించే ప్రాణశక్తిని అణచిపెట్టేయడమేనని ఆమె అనుకుని ఉండవచ్చు. ఒక చెట్టులాగ కాకుండా సదా ప్రవహించే నదిలా వుండాలనుకున్నది కాబట్టి అమెకి రెండు ఒడ్డులున్నాయి.

**ఆక్రందనను ఆనందపు ఆఖ్యాయికగా మలిచి నడిచాను**
**ఉపవన పథ కంటకాన్ని కోమల పుష్పస్పందనతో**
**నిర్జన పథకంటకాన్ని దారుణ ఒంటరితనంతో తెలుసుకున్నాను**

అంటున్నది అందుకే.

తక్కిన భావకవుల్లాగా తాను సబ్లైమ్‌కి ఒక మానవాకృతి ఇవ్వకుండా వుండ లేకపోయినప్పుడు కూడా ఆ సందిగ్ధత అలానే ఉంటుంది:

**కన్నీటితో కిరణాలు తుడిచిన సమయాన**
**సుదూరసంగీతమువలె**

**ఆవలి తీరము నుండి**
**పిలుస్తాడే నన్ను**
**ఎవడు వాడు?**

**మెరసి తళుక్కుమని**
**మెరుపు మందస్మితంతో**
**మూస్తాడే నా కనులు**
**ఎవడువాడు?**
**అవని అంబరపు వెండి ముత్తెపు చిప్పయందు**
**కదలి కదలాడు ముత్తెమువలె**
**కంపించు సమయాన**
**పరిమళమై**
**నిద్రలోని నిశ్వాసము వలె**
**జోకొట్టుతాడే నన్ను**
**ఎవడువాడు?**

ఈ ప్రపంచం వివిధ స్కంధాల కలయిక అనీ, ఏ క్షణమూ శాశ్వతం కాదనీ, నేటి క్షణం నుంచి మరుసటి క్షణం సదా పుడుతూనే ఉంటుందనీ బుద్ధుడు చెప్పినప్పుడు కొందరు సన్న్యాసినులు థేరీగాథలు పాడిఉండవచ్చు, కాని శిల్పులకి మాత్రం అందులో గొప్ప సౌందర్యసంపాదనం కనిపించింది. మహాదేవి వర్మ కూడా అటువంటి శిల్పి. కాని ఆమె శిలని శిల్పంగా కాకుండా వెన్నలాగా మార్చాలని తపించింది. కాలం చేతివేళ్ళ సందుల్లోంచి అనుక్షణం జారిపోతున్నప్పుడు నిన్ను నిలవనియ్యని మహాసౌందర్యానుభవాన్ని ఒక శాశ్వత శిల్పంగా చెక్కడం అసాధ్యం. అందుకనే తొలి బౌద్ధ శిల్పులు బుద్ధుణ్ణి చెక్కవలసివచ్చినప్పుడు ఆయన వదనాన్ని కాక, చరణద్వయాన్నో, పూర్ణకుంభాన్నో మాత్రమే చెక్కి ఉండిపోయారు.

మహాదేవి వర్మకి ఈ సంగతి స్పష్టం.

**రూపు రేఖల కట్టడుల యందు**
**కఠిన హద్దుల బంధనముల యందు**
**నిర్దయ ఘడియలందు**
**బంధించబడింది జగత్తు.**

ఈ మెలకువ వల్ల ఆమె ఒక అద్భుతమైన వాక్యం రాసింది:

**తెలుసుకుని నడిచాను నేను క్షణక్షణం జీవనం**
**నశించడానికి నిర్మించి నడిచాను.**

'నశించడానికి నిర్మించడం'. ఎంత జ్ఞానస్ఫోరకమైనమాట! ఇది నశ్వర జగత్తు, సందేహం లేదు. కాని నీ నిర్మాణాలు మాత్రం అనశ్వరం కావాలనుకుంటావు, ఎంత హాస్యాస్పదం. కాని నువ్వు నిర్మించకుండా ఉండలేవు. ఇందుకు పరిష్కారమొక్కటే, నశించడానికి నిర్మించడం. అనుక్షణ నశ్వరం, అనుక్షణ పునరుజ్జీవితం అయిన ఈ లోకంలో నీకు అనుభవానికొస్తున్న సౌందర్యం కూడా అనుక్షణ ఉత్థానపతనాలకు లోనయ్యేదే.

**అంటుంది శ్వాస వస్తాడు ప్రియుడు**
**చెపుతుంది నిశ్వాసం వెళ్తాడు అతడు**
**తెలియని దానిని తెలుసుకున్నాయి కనులు**
**చిరకాలపు బంధమిది, చెపుతుంది మనసు**
**వస్తుంది స్ఫురణకు ఈ స్వప్నం సుందరం**
**క్షణక్షణం అవుతుంది నూతనం.**

సృజనోత్సాహం వేదాంతాన్ని మించింది. జగత్తు నశ్వరమే, కాని ఆ పునః పునః నశించే జీవనవికాసంలో ఏదో సత్యముంది, నిన్ను నిలవనియ్యని సౌందర్యముంది.

**నశించిపోతాయి వేనవేలు చిరుబీజాలు**
**చేయాలని ఒక నశ్వర బీజం**
**త్యజిస్తాయి వృంతాలను పల్లవాలు**
**రాలి వికసింపచేయాలని నూతనం**
**లయమవుతుంది చూడు ప్రియా చిరుఘడియ**
**చేయడానికి లయం ఎన్నెన్ని యుగకల్పాలు**

మహాదేవి వర్మ కవిత్వం మొదట సంగీతంగా గోచరించి, మళ్ళీ మళ్ళీ చదివినప్పుడు ఆ కవిత్వంలోని అనిర్వచనీయ మార్మికత వల్ల ఒక నైరూప్య చిత్రలేఖనంగా స్ఫురిస్తుందని గ్రహించాను.

## 4

మహాదేవి వర్మ కవిత్వంలో నాకు కనిపించిన మూడు ముఖ్యలక్షణాల్లో మొదటిది సంగీతాత్మకత, రెండవది నైరూప్య వర్ణసంయోజనం కాగా మూడవది భావపరమైన వ్యాకులత్వం.

మహాదేవి వర్మ కవిత్వం భగవంతుడి కోసమో, దివ్యత్వం కోసమో పరితాపమని చెప్పవచ్చు. కానీ అది ఆ కవిత్వం మనలో రేకెత్తించగల స్పందనల్ని స్థూలంగా ఒక గాటన కట్టాలని చూడటమే. భగవంతుడి కోసం పరితపించిన కవయిత్రులు ఆండాళ్, మీరా, అక్కమహాదేవి, జనాబాయి వంటివారి కవిత్వంలో కనవచ్చే పరితాపం వేరు. ఆ కవితల్లో విరహవేదన ఉండవచ్చు కాని వ్యాకులత్వం ఉండదు. జీవనసంతోషం, ప్రేమపారవశ్యం, దర్శన నైశ్చల్యం కనిపిస్తాయి. కాని మహాదేవి వర్మ కవిత్వంలో అటువంటి నిశ్చలత్వం కనిపించదు. ఆమె కవితలన్నిటా పదే పదే కనవచ్చే మాట 'చంచలం'. ఆ చంచలత్వం వల్ల ఒక వ్యాకులత్వం.

ఇక్కడే ఆమెని మనం ఆమెలోని ఆధునికతను గుర్తుపట్టవచ్చు. తాను దర్శిస్తున్న సబ్జెక్ట్‌ని ఆమె ఒక మూర్తిగా ప్రతిష్టించి తదేకచిత్తంతో స్తుతించినట్టయితే ఆ కవిత్వం మధ్యయుగాల భారతదేశానికి సరిపోయిఉండేది, కాని భారతదేశం ఆధునీకరణ చెందుతున్న కాలంలో ఆమె కవిత్వం చెప్పినందువల్ల యుగధర్మం ఆమెలో ప్రతిఫలించకుండా ఉండలేదు. ఆధునిక జీవిత లక్షణాలుగా చెప్పదగ్గ అసంతృప్తి, సంశయం, నిస్పృహ, anguish ఆమె కవిత్వాన్ని సంచలితం చేసినందువల్ల ఆ కవిత్వం మనల్ని కూడా వ్యాకులపరుస్తుంది. భాషలోని సంగీతాత్మకత వల్ల, తన దర్శనానుభవాన్ని ఒక విగ్రహంగా మార్చనందువల్ల ఆమె కవిత్వం కాలాతీతంగా నిలబడుతుందిగాని, అందులో కనవచ్చే వ్యాకులత్వం వల్ల మాత్రం ఆమెను మన కాలానికి చెందిన కవయిత్రిగా స్పష్టంగా పోల్చుకోవచ్చు. మొదటి రెండు కారణాల వల్లా ఆమె ఒక మిస్టిక్ కవయిత్రి, కాని మూడవ లక్షణం వల్ల ఆమెనొక గొప్ప ఫెమినిస్టు కవయిత్రిగా కూడా మనం చెప్పవచ్చు.

ఈ ఫెమినిజం సామాజిక-రాజకీయ రంగాల్లో స్త్రీస్వాతంత్ర్యం కోసం పోరాడే ఫెమినిజం కాదు. నిజానికి ఈ ఫెమినిజానికి స్థలసంబంధం కాదు. ఇది ఒక కాలం కోసం ఆరాటం. సామాజికంగా, రాజకీయంగా నిర్దేశించబడ్డ కాలచక్రాన్ని నిరాకరించి తనను తాను చూసుకోగల, కనుగొనగల కాలం కోసం అన్వేషణ.

ఈ కాలం చారిత్రికం కాదు, మానసికం. కాని సృజనాత్మకం. గింజ భూమిలో

పడ్డప్పుడు దానిలోంచి అంకురం తలెత్తే కాలం చారిత్రికంకాదు, సనాతనం, అయినా నిత్యనూతనం. ఆ కాలం ఆధునిక దృక్పథం మనకు అలవాటు చేసిన linear time కాదు, అది cyclical time.

కాలాన్ని ఒక సరళరేఖ గా భావించడం చరిత్ర, అందులో గతం, వర్తమానం, భవిష్యత్తు మాత్రమే ఉంటాయి. అక్కడ నువ్వొక క్షణాన్ని కోల్పోతే ఆ అవకాశాన్ని మరెన్నటికీ పొందలేవు. మృత్యువంటే అదే. కానీ వర్తులకాలమట్లా కాదు. అక్కడ ఒక క్షణం నశించి మరొక క్షణం పుత్పన్నమయినప్పుడల్లా జీవితం కొనసాగడానికి కొత్త అవకాశం లభిస్తూనే వుంటుంది. నిన్ను నువ్వు దర్శించుకునేటంతవరకూ జన్మపరంపర కొనసాగుతూనే ఉంటుంది. చివరికి నిన్నొకనాడు నువ్వు గుర్తుపట్టగానే కాలం తెగిపోతుంది. నువ్వు విడుదలవుతావు. ఆ క్షణం దొరికేదాకా ఆ ఆరాటం, ఆ వ్యాకులత్వం తప్పవు.

నీ నుంచి నీ ఎడబాటువల్ల కలిగే వేదన భారతీయ భక్తికవిత్వమంతా పరుచుకునే ఉంది. కాని ఆ వేదననుంచి ఒక శ్రీరంగనాథుడో, గిరిధర గోపాలుడో, చెన్నమల్లికార్జునుడో తప్పిస్తాడని ఎదురుచూడకపోవడమే మహాదేవి వర్మను అద్వితీయ కవయిత్రిగా మార్చేసింది. తన వేదననుంచి తనను బయటపడవేసుకోగలిగింది తానే. అది తన గానం ద్వారా, కవిత్వం ద్వారా మాత్రమే సాధ్యమవుతుంది. ఈ ప్రక్రియనే ప్రసిద్ధ ఫ్రెంచి ఫెమినిస్టు రచయిత్రి జూలియా క్రిస్టేవా aesthetic practice అంది. ఒక సౌందర్య సాధన. linear time తన మీద విధించే సామాజిక-రాజకీయ పరిమితుల్ని ఛేదించి తనను తాను నిర్లేపంగా దర్శించగలగడం.

అలాగని అది పూర్తి నిర్గుణం కాదు, సగుణం కూడా. సగుణం మాత్రమే కాదు, నిర్గుణం కూడా.

'మేలుకో మేలుకో ఓ సుకేశినీ' అన్న కవిత చూడండి. అందులో ఆమె 'సుకేశిని', 'స్వప్ననిమేషిని', 'పథప్రదర్శిని', 'విరాగనివేశిని', 'పరదేశిని' కూడా. 'సుకేశిని' చాలా స్పష్టమైన రూపం. 'పరదేశిని' పూర్తి ఆగంతుకం. సగుణ నిర్గుణాల సరిహద్దుల్లో తచ్చాడుతున్నందువల్ల ఆ హృదయం సదా వ్యాకులం. ఆ వైరుధ్యమేమిటో కూడా ఆమెకి అనుభవమే.

'కావవి - చిరునవ్వుల పువ్వులు, వాడుట రానివవి' అన్న కవిత చూడండి. వాడటం తెలియని పువ్వులు, ఆరిపోవడం మెచ్చని దివ్వెలు, బాధ ఒడలు మరిచి నిద్రించగలిగే ప్రాణం పానుపులతో కూడిన అమరుల లోకం తనకి వద్దంటున్నది. తనకి కావలసినది మరణించి నశించే అధికారం. ఇక్కడ 'అధికారం' అన్నమాట

ఎంతో విలువైనమాట. తాను నశ్వరమని గుర్తించడంలోనే తన సాధికారికత వుంది. ఆ మర్త్యత్వమే ఆమె హృదయవ్యాకులతను సౌందర్యశకలంగా మార్చి అనశ్వరం చేస్తున్నది.

ఈ కవిత్వం చదివినప్పుడు Thank You For These Illusions (1981) అనే పేరిట సంకలితమైన కొందరు ఫిన్నిష్ కవయిత్రుల కవితలు గుర్తొచ్చాయి. సంవత్సరానికి ఆరునెలలు పైగా చీకటిలో గడపవలసివచ్చే జీవితంలోంచి వచ్చిన ఆ కవిత్వంలో రెండు రకాల యాథార్థ్యాలు కనిపిస్తాయి. తమ చుట్టూ ఉండే సమకాలిక దైనందిన జీవితం, అది లేవనెత్తే సమస్యలు ప్రశ్నలు ఒకవైపు, కాని దాన్ని దాటి యుగాలుగా తమని బతికిస్తున్న ప్రాణశక్తి ప్రవాహం మరొకవైపు. ఆ కవితల్లో, 'ఈ భ్రాంతులకి నా కృతజ్ఞతలు' అనే కవితలో ఒక కవయిత్రి ఇలా అంటున్నది:

**ఈ భ్రాంతులకి నా కృతజ్ఞతలు.**
**ఈ సున్నితమైన తలపులు**
**వీటిని జాగ్రత్తగా పట్టుకో**
**సత్యం ఇక్కడ చేతికందుతోంది**
**ఇంతలో కోమలం, ఇంతలో కర్కశం**
**యథార్థ జీవితం ఎంతైనా పెనగులాడనీ**
**ఈ భ్రాంతి చెక్కుచెదరదు.**

**మానవాళికొక ఆశ.**

**నేలా నీళ్ళూ ఒకనాటికి శుభ్రపడతాయని**
**వాళ్ళు విషాల్నీ, ఆయుధాల్నీ ఉత్పత్తిచెయ్యడం మానేసిన రోజున**
**ఊపిరిపీల్చడానికొకింత చక్కటి గాలి దొరుకుతుందని.**
**మళ్ళా మరొక్కసారి మనం చెట్లనీడన కూచుని**
**కవితలు చదువుకుంటామని**
**సోక్రటీస్‌ని వినగలుగుతామని.**
**కొత్త భావావేశాలు కలుగుతాయని**
**కొత్త సంవేదనలు రేకెత్తుతాయని.**
**ఓ భ్రాంతిశకలమా, నువ్వింకా సజీవంగానే ఉన్నావు కద**
**నా అమాయక హృదయంతో ఎలుగెత్తి పిలుస్తున్నాను నిన్ను.**

మన కాలానికి మరీ సన్నిహితంగా ఉన్న ఈ కవిత మహాదేవి వర్మ కవితకు మరింత విపులవ్యాఖ్యానంలా తోచింది నాకు. ఈ కవితను కుదిస్తే, మహాదేవి వర్మ ఇలా చెప్పిందనిపిస్తుంది:

**నాశనాన్ని, అనంత వికాస క్రమాన్నీ**
**పరిత్యాగదినాన్నీ, అంతిమసమ్మోహాంధకారాన్నీ**
**తంత్రినీ, ఆఘాతాన్నీ, ఝుంకృతి గతినీ**
**పాత్రనీ, మధునీ, మధుపాన్నీ, మధుర విస్మృతినీ**
**అధరాన్నీ, స్మిత జ్యోత్స్ననీ నేను.**

## 5

ఈ అనువాదాల్లో చాగంటి తులసిగారు కనపర్చిన శ్రద్ధనీ, ప్రజ్ఞనీ కూడా ప్రస్తుతించవలసిఉంది. ఆమెలో ఇంత కవిత్వ సౌకుమార్యం ఉందని నాకు తెలియదు, కాని ఆశ్చర్యమయితే కలిగించలేదు. ఎందుకంటే చాసోగారు ముందు కవికావాలని కోరుకుని ఆపైన కథకుడిగా మారినప్పటికీ ఆయన కథలు కొన్ని, ముఖ్యంగా, 'మాతృధర్మం' లాంటివి కావ్యసమానాలే. ఆ తండ్రి వారసత్వం ఆమెలో ఈ అనువాదంలో పూర్తిగా ప్రస్ఫుటమయిందనవచ్చు.

మూలంలోని సంగీతాన్ని తెలుగులోకి తీసుకురావడం కష్టమే. కాని ఆ సంగీతమెటువంటిదో సూచించగలగడంలో అనువాదం సఫలమయింది. చాలాచోట్ల మూలంలోని సున్నిత శబ్దఛాయల్ని, అర్థ ఛాయల్ని తెలుగులో మరింత సుసంపన్నంగా ప్రకాశపరిచగలిగింది.

ఉదాహరణకి 'ఫూల్ కొ ఉర్ మే ఛిపాయే వికల్ బుల్ బుల్ హూ' అనే వాక్యాన్ని తెలుగు చేసినప్పుడు 'అయినను కలతల పికిలి పిట్టను నేను' అనడం చూడండి. 'వికల్ బుల్ బుల్' 'కలతల పికిలిపిట్ట' గా కనిపించేటప్పటికి నాకు రోమాంచితమైంది.

ఇట్లాంటివెన్నో ఉదాహరణలు ఇవ్వవచ్చు:

'ఆర్ద్ర చిత్ వన్ మే యహాఁ / శత విద్యుతోం మే దీప్ ఖేలా' అన్న వాక్యం 'తేమచూపులతో ఇచట ఆటలాడింది నూరుమెరుపుల దీపం' అని మారినప్పుడు శతవిద్యుత్తులు నూరుమెరుపులు కావడంలో ఆశ్చర్యం లేదు కానీ, 'తేమచూపులు' మామూలు మాట కాదు. హృదయంలో తేమ ఉంటే తప్ప అక్కడ తేమ అన్న

మాట స్ఫురించి ఉండేది కాదు.

**'ఉతరో అబ్ పలకోం మే పాహున్'** అనే వాక్యం

**'దిగి రా ఇక ఇప్పుడు**

**రెప్పల పయికి**

**ఓ అతిథీ'**

అనే మూడు పంక్తులుగా మారినప్పుడు అందులో ప్రియాహ్వానమే కాదు, ఒక అవతరణ దృశ్యం కూడా ఆవిష్కృతమైంది.

'స్వప్న రంగీలే ఘన్' 'స్వప్న ప్రియ మేఘం'గా, 'జుగునూ కే స్వర్ణ్ ఫూల్', 'మిణుగురుల పుత్తడిపువ్వులు'గా, 'మధుర్ మధు కీ యామినీ', 'తీపితేనియల రాతిరి'గా, 'ఎక్ స్పందన్ కహ్ రహా హై అకథ్ యుగ్ యుగ్ కీ కహానీ' అనే వాక్యం 'చెపుతుంది ఒక చిరు కదలిక చెప్పని యుగయుగాల కథ'గా, 'కూల్ భీ హూ కూల్ హీన్ ప్రవాహినీ భీ హూ' అన్న వాక్యం 'ఒడ్డునీ, ఒడ్డులేని వెల్లువనీ'గా మారడం విస్మయకారకంగా కనిపిస్తుంది.

కొన్ని కవితల్ని మూలంలో ఉన్నంత సంగీతాత్మకంగానూ తెలుగులోకి తేవడానికి అనువాదకురాలు ప్రయత్నించారు. 'విరహ్ కా జలజాత్ జీవన్ విరహ్ కా జలజాత్' అన్న గీతాన్నే చూడండి.

**'విరహ జలజాతం జీవనం, విరహ జలజాతం'** అని మొదలయ్యే ఈ గీతంలో

**'ఆసువోంకా కోష్ ఉర దృగ్ అశ్రు కీ టక్ సాల్**

**తరల్ జల్ కణ్ సే బనే ఘన్ సా క్షణిక్ మృదు గాత్'**

తెలుగులో

**'కనులు కన్నీటి టంకశాల హృదయం కన్నీటి కోశాగారం**

**అయింది అంబుధరం వలె కదలాడు తుంపరతో క్షణకాల మృదుదేహం'**

అని అనూదితమైనప్పుడు మూలంలో కన్నా తెలుగులో పదాలు, వివరణా కొంచెం పెరిగినప్పటికీ, ఆ సంగీతం మాత్రం చెక్కుచెదరలేదు.

ఆ కవిత చివరికి వచ్చేటప్పటికి

**'జో తుమ్హారా హో సకే లీలా కమల్ యహ్ ఆజ్**

**ఖిల్ ఉఠే నిరుపమ్ తుమారీ దేఖ్ స్మిత కా ప్రాత్'**

అనే పంక్తులు

**'అవగలగాలి ఈ దినాన నీదే లీలా కమలం**
**అనన్య, చూసి వికసించాలి నీ స్మిత నిశాంతం'**

అని మారినప్పుడు 'నిరుపమ' అనే పదం 'అనన్య' గా మారడం నన్ను ఆశ్చర్య చకితుణ్ణి చేసింది.

చాలాచోట్ల ఆమె మూలంలోని పదసంయోజనాన్ని అది ఎక్కడెక్కడ సంస్కృత సమంగా ఉందో దాన్నంతా అట్లానే జాగ్రత్తగా తెలుగులోకి తీసుకువచ్చారు, కాని దాన్ని తెలుగుపదాలతో అతికేటప్పుడు ఆ అతుకు కనిపించకుండా అందమైన అల్లిక అల్లుతూ వచ్చారు. అందువల్ల చాలా అనువాదాల్లో కనిపించే శ్రవణనిష్టురత్వం ఈ అనువాదంలో కనిపించలేదు. ఉదాహరణకి–

**'లయ బనీ మృదు వర్తికా**
**హర్ స్వర్ జలా బన్ లౌ సజీలీ**
**ఫైలతీ ఆలోక్ సీ**
**ఝుంకార్ మేరీ స్నేహ్ గీలీ'**

తెలుగులో

**'అయింది లయ మృదువర్తిక**
**ప్రతిస్వరం అయింది వెలుగు చిందించే**
**అలంకృత శిఖ**
**ప్రకాశం వలె పరుచుకుంటుంది**
**నా స్నేహసిక్తపు ఝుంకృతి.'**

అలాగే–

**'కుముద దల్ సే వేదనా కే దాగ్ కో**
**పోంఛతీ జబ్ ఆసువోం సే రశ్మియా**
**చౌంక్ ఉటతీ అనిల్ కే నిశ్వాస్ ఛూ**
**తారికాయే చకిత్ సీ అనజాన్ సీ'**

తెలుగులో

**'కుముదదళాల వేదన మరకను**
**కన్నీటితో కిరణాలు**
**తుడిచిన సమయాన**
**గాలి ఊపిరులు తాకినసమయాన**

**తారకలు చకితలవలె**
**తెలియని వారివలె**
**త్రుళ్ళిపడిన సమయాన'**

ఇంకా–

**'మకరంద్ పగీ కేసర్ పర్**
**జీతీ మధు పరియా ఘూంఘూం**
**యా ఉర్ పంజర్ మే కణ్ కీ**
**తరసే జీవన్ శుక్ దేఖూ'**

తెలుగులో

**'మకరంద కేసరాల పయిన**
**తేనె అచ్చరలను పరికించనా**
**మరి మానస పంజరమున**
**తండులములకు తహతహలాడే**
**జీవన కీరమును చూడనా'**

అంటున్నప్పుడు కణాలు తండులాలు కావడం, జీవనశుకం జీవనకీరం కావడం అనువాదాన్ని అనుసృజనగా మార్చే తావులే కదా.

**ప్రేమ యందు ఒడలు మరిచి కనులయందు**
**నింపుకొని సుందరచంచల స్వప్నం**
**త్యజించి ఏ పాతాళపురం, తెచ్చావు ఏ అంబర ప్రసూనం**
**రాతిరి అశ్రువులతో తడిపి మనోహరం**
**ప్రియా నీవు రాగరంజితం నీ నిశ్వాసం రసమయం**

లాంటి చరణాలు అనువాదస్థాయినిదాటి స్వతంత్ర తెలుగుకవితగా నిలబడే స్థాయిని సంతరించుకున్నాయి.

ఒక కవయిత్రి తన కన్నీటితో తుడిచిన వేదన మరకను ఎంతో సున్నితంగా మనవంటి సాహిత్యపిపాసులపట్ల ప్రతిఫలాపేక్షలేని ప్రేమతో అందించినందుకు తులసిగారికి తెలుగు సాహిత్యలోకం తరపున కృతజ్ఞతాంజలి ఘటిస్తున్నాను.

హైదరాబాదు **– వాడ్రేవు చినవీరభద్రుడు**
వైశాఖపూర్ణిమ
3 మే 2015

# महादेवी वर्मा के गीत 1

तू धूल भरा ही आया।

ओ चंचल जीवन-बाल। मृत्यु जननी ने अंक लगाया।

साधों ने पथ के कण मदिरा से सींचे,

झंझा आंधी ने फिर-फिर आ दृग मींचे,

आलोक तिमिर ने क्षण का कुहक बिछाया।

अंगार-खिलौनों का था मन अनुरागी,

पर रोमों से हिम-जड़ित अवशता जागी,

शत-शत प्यासों को चली लुभाती छाया।

गाढे विषाद ने अंक कर दिये पंकिल,

बिंध गये पगों में शूल व्यथा के दुर्मिल,

कर क्षार सांस ने उर का स्वर्ण उड़ाया।

# మహాదేవి వర్మ గీతాలు

1

నిందాధూళితోనే వచ్చావు నీవు
ఓయీ చంచల జీవన అజ్ఞానీ
తీసుకుంది కౌగిలికి మృత్యు జనని

మార్గ రేణువులను మదిరతో తడిపాయి కోరికలు,
మూసాయి కనులను మరల మరల వచ్చి వచ్చి,
గాలి దుమారాలు గాలివానలు
చేసాయి క్షణకాలపు కనుమాయ చీకటి వెలుగులు

మక్కువ ఎక్కువ మనసుకు అంగారపు ఆట వస్తువులు,
రోమాల నుండి జనించాయి హిమజడపు అస్వాధీనతలు,
మోహపెడుతూ నడిచింది నీడ శతశత పిపాసలు.

గాఢవిషాదం ఒడినిండ నింపింది మాలిన్యాలు
ఛిద్రపరిచాయి చరణాలను వెతల శూలాలు
బూడిదను చేసి ఎగరవేసింది శ్వాస హృదయ సువర్ణాలు.

पाथेय-हीन जब छोड़ गये सब सपने,
आख्यानशेष रह गये अंक ही अपने,
तब उस अंचल ने दे संकेत बुलाया।

जिस दिन लौटा तू चकित-थकित सा उन्मन,
करूणा से उस के भर-भर आये लोचन,
चितवन छाया में दृग-जल से नहलाया।

पलकों पर धर-धर अगणित शीतल चुम्बन,
अपनी सांसों से पोंछ वेदना के क्षण,
हिम-स्निग्ध करों से बेसुध प्राण सुलाया।

नूतन प्रभात में अक्षय गति का वर दे,
तन सजल-घटा सा तड़ित छटा-सा उर दे,
हंस तुझे खेलने फिर जग में पहुंचाया।

तू धूल भरा जब आया,
ओ चंचल जीवन-बाल। मृत्यु जननी ने अंक लगाया।

***

దారి బత్తెం లేకుండా వదిలేసాయి
అన్ని కలలు
కంచికి వెళ్లకుండా నా ఒడిలోనే ఉండిపోయాయి
అన్ని కథలు
అదిగో అప్పుడు సైగతో పిలిచాయి
ఆ చేలాంచలాలు.

అన్యమనస్కంగా నివ్వెర చెందిన విధాన
పాలుమారిన చందాన
నీవు తిరిగి వచ్చిన ఈ రోజున
కరుణతో క్రమ్ముకు వచ్చింది కన్నీరు తన కన్నుల నిండుగ
తీర్థమాడించింది నేత్ర జలంతో చూపుల నీడన.

పెట్టి పెట్టి లెక్కలేనన్ని చల్లని ముద్దులు కనురెప్పల పయిన
తుడిచిపెట్టింది వేదన ఘడియలను తన శ్వాసతో
తెలివి తప్పిన ప్రాణాలను జోగొట్టింది హిమస్నిగ్ధ హస్తంతో

నూతన ప్రభాతాన ప్రసాదించి అక్షయగతి వరాన్ని
ఇచ్చి నీరు నిండిన నీరదసమ శరీరాన్ని
ప్రసాదించి విద్యుత్ ప్రకాశ సదృశ హృదయాన్ని
నవ్వి పంపించింది ఆడదానికి ఆట లోకానికి మరల నిన్ను

నిండా ధూళితోనే వచ్చినప్పుడు
నువ్వు
ఓయీ చంచల జీవన అజ్ఞాని
తీసుకుంది కౌగిలికి మృత్యుజనని.

***

2

रूपसि तेरा घन-केश-पाश!
श्यामल श्यामल कोमल कोमल,
लहराता सुरभित केश-पाश!

नभगंगा की रजतधार में,
धो आयी क्या इन्हें रात!
कम्पित है तेरे सजल अंग,
सिहरा सा तन है सद्यस्नात!
भीगी अलकों के छोरों से,
चूतीं बूंदें कर विविध लास!
रूपसि तेरा घन-केश-पाश!
सौरभ भीना झीना गीला
लिपटा मृदु अंजन-सा दुकूल;
चल अंचल से झर-झर झरते
पथ में जुगनू के स्वर्ण-फूल;
दीपक से देता बार-बार
तेरा उज्ज्वल चितवन विलास!
रूपसि तेरा घन-केश-पाश!



వర్షం

2

## రూపసి నీ ఘన కేశ పాశం

నల్లనల్లగ మెత్తమెత్తగ
తరంగిత పరిమళ కేశపాశం

శుభ్రపరుచుకొని వచ్చావా వీటిని
పాలపుంత వెండినీట రాతిరి వేళ
కంపిస్తున్నాది నీటితో మేను
ఒణుకుతున్నట్టు నీ ఒడలు
ఓహో సద్యస్నాతా!
తడిసిన అలకల
చివరల జలబిందువుల
వివిధ విధ నర్తనం
రూపసి నీ ఘన కేశపాశం

పరిమళం నింపుకొని
పలచ పలచగ తేమతేమగ
మెత్తమెత్తని అంజనం వలె
దుకూలం
దారివెంబడిని
అల్లల్లాడు చేలాంచలాల
మిణుగురుల పుత్తడి పువ్వులు
ప్రసాదిస్తుంది మరల మరల
దీపం వలె
నీచూపుల ఉజ్జ్వల విలాసం
రూపసి నీ ఘన కేశ పాశం

उच्छ्वसित वक्ष पर चंचल है
बकपाँतों का अरविंद-हार;
    तेरी निश्वासें छू भू को
    बन-बन जातीं मलयज बयार;
        केकारव-रथ की नूपुर ध्वनि सुन
            जगती जगती की मूक प्यास!
                रूपसि तेरा घन-केश-पाश!

इन स्निग्ध लटों से छा दे तन,
पुलकित अंकों में भर विशाल;
    झुक सस्मित शीतल चुम्बन से
    अंकित कर इसका मृदुल भाल;
        दुलरा देना, बहला देना
            यह तेरा शिशु जब है उदास!
                रूपसि तेरा घन-केश-पाश!

***

ఎగ ఊపిరుల ఎదపయిన
కదలాడే కొంగ వరసల
కమలాలమాల
నీ ఊపిరులు నేలని తాకి
అవుతాయి
మలయమారుతాలు
క్రేంకార రథ నూపురనాదం
సోకగానే చెవిని
వేస్తుంది మౌనదాహం ధరిత్రికి
రూపసి నీ ఘనకేశపాశం

పరిచేయి విశాలంగా
దేహమంతా
ఈ స్నిగ్ధ కేశపాశం
ఆలింగనం చేసుకో పులకింతను
చుంబించు అవనతమై
స్మిత సహిత శీతలంగా
దీని కోమల లలాటాన
లాలించు మరిపించు
నీ ఈ శిశు లోకం
విచారంలో మునిగిన క్షణాన
రూపసి నీ ఘనకేశపాశం

***

3

मैं नीर भरी दुख की बदली!

स्पंदन में चिर निस्पन्द बसा,
क्रन्दन में आहत विश्व हंसा,
नयनों में दीपक से जलते
पलकों में निर्झरिणी मचली!

मेरा पग-पग संगीत भरा,
श्वासों से स्वप्न-पराग झरा,
नभ के नवरंग बुनते दुकूल,
छाया में मलय-बयार पली!

मैं क्षितिज-भृकुटि पर घिर धूमिल,
चिंता का भार बनी अविरल,
रज-कण पर जल-कण हो बरसी
नव जीवन- अंकुर बन निकली!

पथ को न मलिन करता आना,
पद-चिह्न न दे जाता जाना,
सुधि मेरे आगम की जग में
सुख की सिहरन हो अन्त खिली!

विस्तृत नभ का कोई कोना,
मेरा न कभी अपना होना,
परिचय इतना इतिहास यही
उमड़ी कल थी मिट आज चली!

***

3

## నీరు నిండిన దుఃఖ నీరదాన్ని నేను!

నిర్విరామ నిశ్చేష్ట నివాసం స్పందనలో,
గాయపడ్డ విశ్వహాసం రోదనలో,
దీపంలా వెలుగుతాయి నయనాల్లో,
కల్లోలిని చేస్తుంది మారాం కనురెప్పలలో !
నా అడుగడుగునా నిండి ఉంది సంగీతం,
రాలుతుంది శ్వాసలో స్వప్న పరాగం,
నభో నవవర్ణాలు నేస్తాయి పచ్చదం,
ఛాయలో పెంపొందుతుంది మలయమారుతం !
క్షితిజ భృకుటిని ఆవరించిన నిస్తేజను,
అయ్యాను ఎడతెగని వెతల బరువును ,
వర్షించాను ధూళికణం పయిన జల కణమై,
వచ్చాను నవజీవన అంకురమై !
మార్గాన్ని మైలపరచని రాకనాది,
కాలి గురుతును వదలని పోక నాది,
లోకాన నా ఆగమన జ్ఞాపకం,
సుఖపు పులకరింతై వికసించింది వినాశనం !
ఏనాడూ ఏ అంతర్దిశా విస్తృత గగనాన,
నాదిగా అవకపోవడం
పరిచయం నాది మరి ఇంతే,
చరిత్ర మరి నాది ఇదే
పొంగిపొరలి ముసురుకు వచ్చా గత దినాన
రాలి నశించిపోయా ఈ దినాన !

***

4

प्रिय! सान्ध्य-गगन

मेरा जीवन!

यह क्षितिज बना धुँधला विराग,
नव अरुण अरुण मेरा सुहाग,
छाया-सी काया वीतराग,
सुधि-भीने स्वप्न रंगीले घन!
साधों की आज सुनहलापन,
घिरता विषाद का तिमिर सघन,
सन्ध्या का नभ से मूक मिलन-
यह अश्रुमती हँसती चितवन!

लाता भर श्वासों का समीर,
जग से स्मृतियों का गन्ध धीर,
सुरभित है जीवन-मृत्यु-तीर,
रोमों में पुलकित कैरव-वन!

4

ప్రియా!
సాంధ్యగగనం
నాజీవనం !

మసకబారి రాగరహితం
ఈ క్షితిజం నవీనం,
అరుణం అరుణం
నా సౌభాగ్యం,
ఛాయాసమవీతరాగదేహం
సూక్ష్మ చైతన్యం
స్వప్నప్రియ మేఘం !

కోరికల స్వర్ణవర్ణం,
ముసురుకువచ్చింది
విషాద గాఢ తిమిరం,
సంధ్య గగనాల మౌనమేళనం
ఈ అశ్రుమతి హాసవీక్షణం !

జగత్తు నుండి నింపాదిగా
నింపుకు వస్తుంది శ్వాస సమీరం,
స్మృతుల సుగంధం
జీవనమృత్యుతీరం సుగంధితం,
రోమరోమం పులకితం
మొగలి వనం !

अब आदि-अंत दोनों मिलते,
रजनी-दिन-परिणय से खिलते,
आँसू मिस हिम के कण ढुलते,
ध्रुव आज बना स्मृति का चल क्षण।
इच्छाओं के सोने-से शर,
किरणों से द्रुत झीने सुन्दर,
सूने असीम नभ में चुभकर-
बन-बन आते नक्षत्र-सुमन!
घर आज चले सुख-दु:ख-विहग!
तम पोंछ रहा मेरा अगजग;
छिप आज चला वह चित्रित मग,
उतरो अब पलकों में पाहुन!

***

*మిళితమవుతాయి ఇప్పుడు*
*రెండూ ఆదీ అంతం,*
*దివారాత్రుల పరిణయం*
*ఆనంద భరితం,*
*జారిపడుతుంది హిమకణం*
*అశ్రుమిషని ఇక ధృవం,*
*స్మృతి చలిత క్షణం.*

*అభిలాషల సువర్ణ శరాలు,*
*చాటుమాటు అందచందాల*
*త్వరిత చలిత కిరణాల వలె,*
*గ్రుచ్చుకొని గగనాన,*
*అనంత శూన్య ఆకశాన*
*అవుతాయి నక్షత్ర సుమాలు. !*

*సుఖదుఃఖాల విహంగాలు*
*ఈ రోజు ఇంటి బాటపట్టాయి !*
*తుడిచి వేస్తోంది తమం*
*నా స్థిర జాగృతిని;*
*ఆ చిత్రిత మార్గం ఈ దినం*
*జారుకుంది చాటుకి,*

*దిగిరా ఇక ఇప్పుడు*
*రెప్పల పయికి*
*ఓ అతిథీ!*

***

5

शून्य मंदिर में बनूंगी आज मैं प्रतिमा तुम्हारी!

अर्चना हो शूल भाले,
क्षार दृग-जल अर्घ्य हो ले,
आज करुणा-स्नात उजला
दुःख हो मेरा पुजारी!

नूपुरों का मूक छूना,
सरव कर दे विश्व सूना,
वह अगम आकाश उतरे
कम्पनों का ही भिखारी!

लोल तारक कभी अचंचल,
चल न मेरा एक कुन्तल,
अचल रोमों में समाई,
मुग्ध हो गीत आज सारी!

राग मद की दूर लाली,
साध भी इस में न पाली,
शून्य चितवन में बसेगी
मूक हो गाथा तुम्हारी!

***

5

*శూన్యమందిరాన నీ ప్రతిమనే అవుతాను ఈ రోజు !*

*అందుకోమరి అర్చనలు శూలాలు,*
*పుచ్చుకోమరి అర్ఘ్యం అశ్రుజలం,*
*స్నానించి ఈ రోజు కరుణయందు*
*నా పూజారి దుఃఖం శుభ్ర ధవళం !*

*చెయ్యవయ్యా నూపుర మౌనస్పర్శ,*
*నింపవయ్యా శూన్య విశ్వం*
*క్వణం క్వణలతో.!*

*దిగనీయవయ్యా అగమ్య ఆకాశం*
*ప్రకంపనల బికారీగా !*
*అప్పుడప్పుడు అచంచలాలు*
*చంచలతంత్రులు,*
*అల్లల్లాడదు నా అలకల యందు*
*ఒక అలకయినను!*

*లీనమయింది ముగ్ధురాలై*
*అచంచల రోమాల్లో,*
*ఈ రోజు పాట సొంతం ముగ్ధం !*
*అనురాగ లాహిరి సుదూర అరుణం,*
*ఇందు జరగదు ఈప్సిత పరితోషణం,*
*శూన్యదృక్కుల్లో నీ కథ*
*మూగదై నిలిచి పోనీ !*

***

6

फिर विकल हैं प्राण मेरे!

तोड़ दो यह क्षितिज मैं भी देख लूँ उस ओर क्या है!
जा रहे जिस शून्य पन्थ से युग कल्प उसका छोर, क्या है?
क्यों मुझे प्राचीर बन कर
आज मेरे श्वास घेरे?

सिन्धु की निस्सीमता पर लघु लहर का लास कैसा!
दीप लघु शिर पर धरे आलोक का आकाश कैसा!
दे रही मेरी चिरन्तनता
क्षणों के साथ फेरे!

बिम्बग्राहकता कणों को, शलभ को चिर साधना दी,
पुलक से नभ भर धरा को कल्पनामय वेदना दी!

## 6

పునః వ్యాకులం నా ప్రాణం !

బ్రద్దలు కొట్టు క్షితిజాన్ని
అవలోకిస్తాను నేనూ
అవతలవేపు ఏముందో !

యుగాలు కల్పాలు నడిచివెళ్లే
ఆ శూన్యమార్గపు ఆఖరి హద్దు ఏమిటో ?

ఎందుకని నన్ను చుట్టబెట్టి
బంధిస్తోంది ప్రాచీరమై
నా శ్వాస ఈ వేళ !

ఏ విధాన సంభవం
అప్రతిహత సాగరాన
లఘు తరంగ నర్తనం !
ఏ విధాన పడుతుంది
దీపం లఘు శిరసు పయిన
వెలుగుల ఆకాశం !
చేస్తోంది నాచిరంతనంత
క్షణాలతో ప్రదక్షిణం !

ప్రసాదించింది కణాలకు
బింబగ్రహణ
ఇచ్చింది శలభానికి
చిరసాధన,
నింపింది పులకింతలతో నభాన్ని
ఇచ్చింది పుడమికి
కల్పనామయ వేదన !

मत कहो हे विश्व! ‘झूठे
हैं अतुल वरदान तेरे’!

नभ डुबा पाया न अपनी बाढ़ में भी क्षुद्र तारे,
ढूँढ़ने करूणा मृदुल घन चीर कर तूफान सारे;
अंत के तम में बुझें क्यों
आदि के अरमान मेरे!

***

*అనవద్దు ఓ విశ్వమా !*
*'అబద్ధాలు*
*నీ అనుపమ వరదానాలు' అని !*

*నష్టపరచలేకపోయింది క్షుద్ర తారకలను*
*తన ప్రాచుర్యం లోనూ నభం,*
*అన్వేషించలేకపోయింది కరుణను*
*చీల్చి కోమల కాదంబినిని*
*సంపూర్ణ ప్రభంజనం;*

*చిట్టచివరి చీకటిలో*
*మొట్టమొదటి కోరికలు నావి*
*ఆరిపోయాయి ఎందుకని!*

***

7

पंथ होने दो अपरिचित, प्राण रहने दो अकेला।

घेर ले छाया अमा बन,
आज कज्जल अश्रुओं में रिमझिमा ले यह घिरा घन

और होंगे नयन सूखे,
तिल बुझे और पलक रूखे,
आर्द्र चितवन में यहां
शत विद्युतों में दीप खेला।

अन्य होंगे चरण हारे,
और हैं जो लौटते, दे शूल को संकल्प सारे

दुखव्रती निर्माण उन्मद,
यह अमरता नापते पद,
बांध देंगे अंक-संसृति
से तिमिर में स्वर्ण बेला
दूसरी होगी कहानी
शून्य में जिस के मिटे स्वर, धूलि में खोई निशानी,

**7**

ఉండనీ మార్గాన్ని అపరిచితంగా,
ఉండనీ ప్రాణాన్ని ఒంటరిగా !

అమవస అయి నీడని చుట్టబెట్టనీ,
కాటుక కన్నీళ్లలో ఈరోజు
ముసురుకు వచ్చిన ఈ మబ్బు
చిరుజల్లులు కురవనీ !

ఆర్చుకుపోతాయి నయనాలు,
కోల్పోతాయి కాంతిని కనుపాపలు,
తడారిపోతాయి కనుతెప్పలు
తేమ చూపులతో ఇచట ఆటాడింది
నూరు మెరుపుల దీపం !

ఓడిన అడుగుల వారు ఇంకెవరో,
మరలి వచ్చినవారు ఎవరో
ప్రసాదించు బాధలకు
సర్వసంకల్పాలు

దుఃఖవ్రతం పట్టిన నిర్మాణోన్మాదం,
సంసృతి* కౌగిలిలో బంధిస్తాయి
అమరత్వాన్ని కొలిచే ఈ చరణాలు,
తిమిరంలో సువర్ణ వేళని
కథ ఇంకొకటిగా తేలుతుంది
మూగబోతుంది శూన్యంలో ఎవరిగొంతు,
జారిపోతుంది ధూళిలో గురుతు,

* సంసృతి = ప్రపంచం

आज जिस पर प्रलय विस्मित,
मैं लगाती चल रही नित,
मोतियों की हाट ओ'
चिनगारियों का एक मेला।

हास का मधुदूत भेजो,
रोष की भ्रू भंगिमा पतझर को चाहे सहेजो।

ले मिलेगा उर अचंचल,
वेदना-जल स्वप्र-शतदल,
जान लो यह मिलन एकाकी
विरह में है दुकेला।

पंथ होने दो अपरिचित, प्राण रहने दो अकेला।

***

ఎవరిమీద విస్మితం ఈ రోజు ప్రళయం,
నిత్యప్రతి చేస్తూ వస్తున్నాను ముత్తెముల సంతని,
నిప్పు నెరసుల సంబరాన్ని.
పంపించు హోన మధు దూతను,
రుషిత భ్రూభంగిమ శిశిరం
పదిల పరచాలనుకుంటే పదిల పరుచుకో

అందుకో అచంచల హృదయం,
అవుతుంది లభ్యం
వేదన జలం
స్వప్న శతదళం,
తెలుసుకో ఈ కలయిక ఒంటరి
ఎడబాటులో ఉన్నది జంట అయి,

ఉండనీ మార్గాన్ని అపరిచితంగా,
ఉండనీ ప్రాణాన్ని ఒంటరిగా.

***

8

**बी**न भी हूँ मैं तुम्हारी रागिनी भी हूँ !

नींद थी मेरी अचल निस्पंद कण-कण में,
प्रथम जागृति थी जगत के प्रथम स्पन्दन में;
प्रलय में मेरा पता पदचिह्न जीवन में,
शाप हूँ जो बन गया वरदान बन्धन में;
कूल भी हूँ कूलहीन प्रवाहिनी भी हूँ !

नयन में जिस के जलद वह तृषित चातक हूँ ,
शलभ जिस के प्राण में वह निठुर दीपक हूँ ;
फूल को उर में छिपाये विकल बुलबुल हूँ ,
एक हो कर दूर तन से छाँह वह चल हूँ ;
दूर तुम से हूँ अखंड सुहागिन भी हूँ !

## 8

*వీణనీ నీ రాగ రాగిణినీ!*

*అణువణువున అచలనిశ్చేష్ట నిద్ర నాది,*
*జగత్తు ప్రథమ స్పందన యందు ప్రథమ జాగృతి నాది,*
*ప్రళయంలో ఉంది నా జాడ;*
*పథచిహ్నంలో ఉంది జీవనం,*
*నేను శాపాన్ని*
*అయ్యాను బంధనంలో వరదానాన్ని;*
*నేను ఒడ్డునీ ఒడ్డులేని వెల్లువనీ!*

*నా నయనాల్లో నిండి ఉంది నీరదం,*
*అయినను పిపాసిని నేను వాన కోయిలని,*
*నా ప్రాణంలో నిలిచి ఉంది నిష్ఠుర దీపం;*
*అయినను శలభాన్ని నేను;*
*నా హృదయంలో దాగుని ఉంది పుష్పం*
*అయినను కలతల పికిలిపిట్టని నేను;*
*ఒక్కరమే అయినను*
*దేహం దూరమయిన ఆ ఛాయ జంగమాన్ని నేను;*
*ఉన్నాను దూరంగా నీకు*
*అయినను అఖండ సౌభాగ్యవతిని నేను!*

आग हूँ जिस से ढुलकते बिन्दु हिमजल के,
शून्य हूँ जिस को बिछे हैं पांवड़े पल के;
पुलक हूँ वह जो पला है कठिन प्रस्तर में,
हूँ वही प्रतिबिम्ब जो आधार के उर में;
नील घन भी हूँ सुनहली दामिनी भी हूँ !

नाश भी हूँ मैं अनन्त विकास का क्रम भी,
त्याग का दिन भी चरम आसक्ति का तम भी,
तार भी आघात भी झंकार की गति भी;
पात्र भी, मधु भी, मधुप भी, मधुर विस्मृति भी;
अधर भी हूँ और स्मित की चाँदनी भी हूँ !

***

*ఆ అనలాన్ని నేను*
*నా నుండి దొరలి దొరలి పడతాయి*
*హిమజల బిందువులు,*
*ఆ శూన్యాన్ని నేను*
*పరుస్తాయి నా కొరకు*
*క్షణాలు ఆస్తరణిని;*
*ఆ రోమాంచాన్ని నేను*
*కఠిన పాషాణ మందు*
*పెంపుపొందిన దానిని,*
*ఆ ప్రతిబింబాన్ని నేను*
*ఆధారపు ఎదలో*
*ఉన్నదానిని,*
*నీలవర్ణపు మేఘాన్నీ బంగరు వన్నెల నీలాంజననీ!*

*నాశనాన్ని అనంత వికాస క్రమాన్నీ,*
*పరిత్యాగ దినాన్నీ అంతిమ సమ్మోహాంధకారాన్నీ;*
*తంత్రినీ, ఆఘాతాన్నీ, ఝుంకృతి గతినీ,*
*పాత్రనీ, మధునీ, మధుపాన్నీ, మధుర విస్మృతినీ;*
*అధరాన్నీ స్మిత జ్యోత్స్ననీ నేను!*

***

9

सब आँखों के आँसू उजले
सब के सपनों में सत्य पला।
जिस ने उस की ज्वाला सौंपी
उस ने इस में मकरंद भरा
आलोक लुटाता वह घुल-घुल
देता झर-झर सौरभ बिखरा।

दोनों संगी पथ एक किन्तु कब
दीप खिला कब फूल जला।

वह अचल धरा को भेंट रहा
शत-शत निर्झर में हो चंचल
चिर परिधि बना भू को घेरे
इस का नित उर्म्मिल करुणा-जल।

कब सागर उर पाषण हुआ,
कब गिरि ने निर्मम तन बदला।

नभ तारक-सा खंड़ित पुलकित
यह क्षुर-धारा को चूम रहा,
वह अंगारों का मधु-रस पी
केसर-किरणों-सा झूम रहा।

9

అందరి చక్షువుల అశ్రువులు ఉజ్జ్వలం
అందరి స్వప్నాల్లో ప్రభవిస్తుంది సత్యం.

అప్పగించాడు జ్వలనం
అందు తానే నింపాడు మకరందం
దోచుకొని ప్రకాశం
అది కరిగి కరిగి పాకిపాకి
వెదజల్లుతోంది సౌరభం.

ఇరువురు మిత్రులు మార్గం ఒకటి
వికసించింది ఎప్పుడు దీపం
జ్వలించింది ఎప్పుడు పుష్పం.

తాను ప్రసాదిస్తున్నాడు అచల ధరణికి బహుమానం
చంచలమై శతశత నిర్ఝరణులందు
చేసుకొని చిరపరిధిని ఆవరించి భూమిని
నిత్య తరంగిత కరుణజలం.

అయింది ఎప్పుడు సాగరహృదయం పాషాణం,
నిష్ఠురదేహం మార్చింది ఎప్పుడు పర్వతం.

ఆకాశం తారకల్లా ఖండితం పులకితం
చుంబిస్తోంది ఇది ఘరిధారా ప్రవాహం,
పానం చేసి అది అంగారాల మధురసం
ఊగుతోంది పరవశాన
కుంకుమ వర్ణ సదృశం.

अनमोल बना रहने को कब
टूटा कंचन हीरक पिघला।

नीलम मरकत के सम्पुट दो
जिन में बनता जीवन-मोती,
इस में ढ़लते सब रंग-रूप
उस की आभा स्पन्दन होती।

जो नभ में विद्युत-मेघ बना
वह रज में अंकुर हो निकला।

संसृति के प्रति पग में मेरी
साँसों का नव अंकन चुन लो,
मेरे बनने-मिटने में नित
अपनी साधों के क्षण गिन लो।

जलते खिलते बढ़ते जग में घुलमिल एकाकी प्राण चला।
सपने-सपने में सत्य ढ़ला।

***

అమూల్యమై ఉండాలని ముక్కలయింది ఎప్పుడు వజ్రం
తప్తమై కరిగింది ఎప్పుడు కాంచనం.

మరకత నీలమణుల బరణులు రెండు
రూపొందుతుంది వాటి యందు జీవన మౌక్తికం,
దానిలో దొరలి దొరలి పడతాయి
అన్నిరంగులు అన్ని రూపాలు
దాని తళతళల ఉద్భాసం
అవుతుంది స్పందనం.

ఆకసమున రూపొందిన విద్యుత్ మేఘం
మట్టియందు బయటపడింది అంకురమై.

ఎంపిక చేసుకో నా శ్వాసల నవలేఖనం
ప్రపంచపు ప్రతి అడుగున,
నా నిత్య సృష్టి లయలందు
లెక్కించుకో నీ అభిలాషల క్షణాలు.

జ్వలిస్తూ వికసిస్తూ వృద్ధి పొందుతూ
లోకాన కరిగి కలిసి కదలాడింది ఏకాకిప్రాణం.
స్వప్నస్వప్నాన రూపొందింది సత్యం.

***

10

अलि मैं कण-कण को जान चली
सब का क्रन्दन पहचान चली।

जो दृग में हीरक-जल भरते,
जो दृग चितवन इन्द्रधनुष करते,
टूटे सपनों के मनकों से
जो सूखे अधरों पर झरते

जिस मुक्ताफल से मेघ भरे,
जो तारों से तृण में उतरे,
मैं नभ के रज के रस-विष के
आँसू के सब रंग जान चली,
दुःख को कर सुख-आख्यान चली।

जिस का मीठा-तीखा दंशन
अंगों में भरता सुख-सिहरन,
जो पग में चुभ कर कर देता,
जर्जर मानस चिर आहत मन,

जो मृदु फूलों के स्पन्दन से,
जो पैना एकाकीपन से
मैं उपवन निर्जन पथ के हर
कंटक का मृदु मन जान चली।
गति का दे चिर वरदान चली।

## 10

తెలుసుకున్నాను చెలీ నేను కణకణాన్ని
గుర్తించి కదిలిపోయాను అందరి క్రందనాన్ని.

అది ఒక క్రందనం
నింపుతుంది కనులలో హీరకజలం
మొలిపిస్తుంది కనులలో ఇంద్ర చాపం,

ఇది ఒక క్రందనం
జలజల జారిపడతాయి
చెదిరిన కలల పూసలు
తడి ఆరిన పెదాల పయిన
మబ్బును నింపిన ముత్యాలరాశులు,
దిగుతుంది ఈ క్రందనం
తారలనుండి తృణాల పయికి,

మన్ను-మిన్నుల రస-విష అశ్రువుల రంగులు
సమస్తం తెలుసుకుని కదిలిపోయాను
ఆక్రందనను ఆనందపు ఆఖ్యాయికగ
మలిచి నడిచాను.

ఒకటి మధు కటు దంశితం
అంగ అంగం పులకితం,
ఒకటి గ్రుచ్చుకొని చరణాలకు
ఇస్తుంది మానని గాయాన్ని మానసానికి,
విరిచేస్తుంది మనసుని
తెలుసుకొన్నాను ఉపవన పథ కంటకాన్ని
కోమల పుష్ప స్పందనతో.
తెలుసుకొన్నాను నిర్జన పథ కంటకాన్ని
దారుణ ఒంటరితనంతో,
తెలుసుకొన్నాను ప్రతి కంటక మృదు మానసాన్ని
నడకకు శాశ్వత వరాన్ని ఇచ్చి నడిచాను.

जो जल में विद्युत-प्यास भरा,
जो आतप में जल-जल निखरा,
जो झरते फूलों पर देता,
निज चंदन-सी ममता बिखरा,

जो आँसू से घुल-घुल उजला,
जो निष्ठुर चरणों का कुचला,
मैं मरू उर्वर में कसक भरे
अणु-अणु का कम्पन जान चली,
प्रतिपग को कर लयवान चली।

नभ मेरा सपना स्वर्ण रजत,
जग संगी अपना चिर विस्मित,
यह शूल-फूल का चिर नूतन
पथ मेरी साधों से निर्मित।

इन आँखों के रस से गीला,
रज भी है दिल से गर्वीली,
मैं सुख से चंचल दुःख बोझिल।
क्षण-क्षण का जीवन जान चली,
मिटने को कर निर्माण चली।

***

ఒకటి నింపింది జలమందు విద్యుత్ పిపాస,
ఒకటి ఆతపంలో తప్తమై ఉజ్జ్వలం,
ఒకటి నేల రాలిన సుమాలకు
పంచింది తన చందన సమ మమత్వం,

ఒకటి అశ్రువులతో ప్రక్షాళితం ఉజ్జ్వలం,
ఒకటి కర్కోటకం చరణ మర్దితం,
ఎడారి క్లేశం ఉర్వర ఖేదనం
తెలుసుకున్నాను నేను అణువణువున
రెండింట నిండిన కంపనం,
ప్రతి అడుగు నడిచాను చేసుకుని లయబద్ధం.

ఆకాశం నా స్వర్ణ రజత స్వప్నం,
లోకం నా మిత్రం చిర విస్మితం,
ఈ కంటక పుష్ప చిరనూతన పథం
నా అభిలాషలతో నిర్మితం.

నా నేత్రరసంతో తడిసి,
మృత్తిక మనసారా గర్వితి,
సుఖంతో అయాను నేను చంచలం.
దుఃఖంతో అయాను నేను భారం
తెలుసుకుని నడిచాను నేను క్షణక్షణం జీవనం,
నశించడానికి నిర్మించి నడిచాను.

***

11

सब बुझे दीपक जला लूँ।
घिर रहा तम आज दीपक-रागिनी
अपनी जला लूँ।

क्षितिज-कारा तोड़ कर अब
गा उठी उन्मत्त आँधी,
अब घटाओं में न रुकती
लास-तन्मय तड़ित बाँधी,
धूलि की इस वीणा पर मैं तार हर तृण का मिला लूँ।

मौन तारक मूँदते दृग
भ्रान्त मारूत पथ न पाता
छोड़ उल्का अंक नभ में
ध्वंस आता हरहराता,
उँगलियों की ओट में सुकुमार सब सपने बचा लूँ।

लय बनी मृदु वर्त्तिका
हर स्वर जला बन लौ सजीली,
फैलती आलोक-सी
झंकार मेरी स्नेह गीली,
इस मरण के पर्व को मैं आज दीपाली बना लूँ।

## 11

వెలిగిస్తాను ఆరిపోయిన దీపాలు అన్నిటిని.
ఆవరిస్తోంది అంధకారం
వెలిగిస్తా నా దీపక–రాగిణిని
ఈ రోజు.

బ్రద్దలు కొట్టి క్షితిజపు బందిఖానా
పాటని అందుకుంది
పిచ్చెక్కిన తుఫాను,
ఇప్పుడు ఇక నిలవదు
శంపాధరమున లాస్యతన్మయ శంపాలత
మేళవిస్తాను ఈ ధూళివీణమీద
ప్రతి తృణ తంత్రిని.

మౌన తారకలు మూసుకుంటాయి కన్నులు
మార్గం దొరకదు భ్రమయందు తిరుగాడు
మారుతమునకు
వదిలేసినవి గగనపు ఒడిని ఉల్కలు
ధడ ధడ ధడా ధడల ధ్వంసం
ఆగమిస్తుంది,
కాపాడుతాను సుకుమార స్వప్నాలను
అంగళుల చాటున.

అయింది లయ మృదువర్తిక
ప్రతిస్వరం అయింది వెలుగులు చిందించే
అలంకృత శిఖ,
ప్రకాశం వలె పరుచుకుంటుంది
నా స్నేహసిక్త ఝంకృతి,
దీపావళిని చేస్తా ఈరోజు ఈ మరణ పర్వాన్ని.

देखकर कोमल व्यथा को
आँसुओं के सजल रथ में,
मोम-सी साधें बिछा दीं,
थीं, इसी अंगार-पथ में,
स्वर्ण हैं वे मत कहो अब क्षार में उनको सुला लूँ।

अब तरी पतवार ला कर
तुम दिखा मत पार देना,
आज गर्जन में मुझे बस,
एक बार पुकार लेना।
ज्वार को तरणी बना मैं, इस प्रलय का पार पा लूँ।
आज दीपक राग गा लूँ।

***

కోమల వ్యథను చూసి
నీరు నిండిన అశ్రు రథాన,
పరిచాను మైనము వంటి మనోరథాలు,
ఉన్నాయి. ఈ అంగార పథమందు,
అవి సువర్ణం అనవద్దు ఇప్పుడు
నిద్రపుచ్చుతాను వాటిని భస్మమందు.

ఇక ఇప్పుడు
పడవా తెడ్డు పట్టుకొచ్చి
చెప్పకు ఒడ్డు చేరడం,
గర్జనలో కేవలం ఒక్కసారి,
కేకవెయ్యి ఈరోజు.
పోటును పడవ చేసుకుని నేను,
దాటుతాను ఈ ప్రళయాన్ని.
దీపక రాగాన్ని పాడతాను ఈరోజు.

***

12

**य**ह मंदिर का दीप,
इसे नीरव जलने दो।

रजत शंख-घड़ियाल स्वर्ण वंशी-वीणा-स्वर,
गयी आरती वेला को शत-शत-लय से भर,
जब था कल कंठों का मेला
विहँसे उपल तिमिर था खेला,
अब मंदिर में इष्ट अकेला,
इसे अजिर का शून्य गलाने को गलने दो।

चरणों से चिह्नित अलिन्द की भूमि सुनहली,
प्रणत शिरों के अंक लिये चन्दन की देहली
झरे सुमन बिखरे अक्षत सित,
धूप-अर्घ्य नैवेद्य अपरिमित
तम में सब होंगे अन्तर्हित,
सब की अर्चित कथा इसी लौ में पलने दो।

## 12

ఇది దేవాలయ దీపం,
వెలగనీయి దీనిని మౌనంగా.

రజత శంఖాలు జేగంటలు
సువర్ణ వేణువులు వీణలు,
సర్వ స్వరాలు
ఆరతివేళ శతశత లయలతో,
సుమధుర కంఠధ్వనుల సంబరం
విహసిస్తుంది ప్రస్తర ప్రతిమ
ఆటలాడుతుంది అంధకారం,
ఇప్పుడు ఇక దేవళంలో
ప్రియప్రతిమ ఒంటరి,
ఉంది దేవళ దీపం
హరించడానికి ప్రాంగణ శూన్యం
హరించనీయి.

చరణముద్రిత సువర్ణ అరిందం,
ప్రణమిల్లిన శిరసులతో
చందన ద్వారం
జారిపడిన పూవులు
చెదిరి పడిన ధవళ అక్షతలు,
ధూప అర్ఘ్య నైవేద్యం
అపరిమితం
అవుతాయి అంతర్హితం
అంధకారమందు,
అందరి అర్చనలు
ఈ దీపశిఖ యందు ఫలించనీయి.

पल के मन के फेर पुजारी विश्व सो गया,
प्रतिध्वनि का इतिहास प्रस्तरों बीच खो गया,
साँसों की समाधि सा जीवन,
मसि-सागर का पंथ गया बन
रूका मुखर कण-कण का स्पन्दन,
इस ज्वाला में प्राण-रूप फिर से ढ़लने दो।

झंझा है दिग्भ्रान्त रात की मूर्छा गहरी,
आज पुजारी बने, ज्योति का यह लघु प्रहरी,

जब तक लौटे दिन की हलचल,
जब तक यह जागेगा प्रतिपल,
रेखाओं में भर आभा-जल
दूत साँझ का इसे प्रभाती तक चलने दो।

***

నిద్రపోయింది క్షణాల పూసలు త్రిప్పుతూ
పూజారి విశ్వం,
మాయమయింది ప్రస్తరాల నడుమ
ప్రతి ధ్వని పురావృత్తం,
ఊపిరుల సమాధి సదృశ జీవనం,
అయింది మసి-సాగర పథం
నిలిచిపోయింది అణువణువుల
ముఖర స్పందనం,
ఈ జ్వాల యందు మరల మూస కట్టనీయి
ప్రాణరూపం.

దిగ్భ్రమల హోరుగాలి
గాఢ అపస్మారకపు రాతిరి,
అవుతాడు ఈరోజు పూజారి,
దీపపు ఈ లఘు ప్రహరి,

కనుమూయదు ఒక క్షణమైన
సంజదూత
రేఖలందు నింపి ప్రభాజలం
పగటి కలకలం కలుగువరకు,
దీనిని సాగిపోనీయి
ప్రభాతం వరకు.

***

13

मधुर मधुर मेरे दीपक जल!
युग युग प्रतिदिन प्रतिक्षण प्रतिपल,
प्रियतम का पथ आलोकित कर!
सौरभ फैला विपुल धूप बन,
मृदुल मोम-सा घुल रे मृदु तन;
दे प्रकाश का सिन्धु अपरिमित,
तेरे जीवन का अणु गल गल!
पुलक पुलक मेरे दीपक जल!
सारे शीतल कोमल नूतन,
मांग रहे तुझ से ज्वाला-कण,
विश्व-शलभ सिर धुन कहता 'मैं
हाय न जल पाया तुझ में मिल!'
सिहर सिहर मेरे दीपक जल!

13

*ముద్దుముద్దుగా*
*వెలుగుము నా దీపమా!*
*యుగయుగాలు ప్రతిదినం ప్రతిక్షణం ప్రతినిమిషాన,*
*నింపుము వెలుగులు ప్రియుని మార్గాన!*

*అలుముకున్నాయి అంతటా*
*ధూపమై సువాసనలు,*
*కరిగిపోవే నా మృదు దేహమా!*
*మెత్తని మైనం వలె కరిగిపోవే*
*నీ బ్రతుకు అణువణువును*
*కరిగించి ఈయవే*
*అపరిమిత వెలుగుల అంబురాశి!*
*పులకరించి పులకరించి*
*వెలుగుము నా దీపమా!*

*అడుగుతున్నాయే అఖిలము*
*శీతలమూ కోమలమూ నూతనము,*
*జ్వలన కణాన్ని,*
*తలమొత్తుకొని 'దగ్ధ మవలేకపోయానే*
*అయ్యయ్యో నీతో కలసి'*
*అంటోందే విశ్వ శలభం!*
*అల్లల్లాడి అల్లల్లాడి*
*వెలుగుము నా దీపమా!*

जलते नभ में देख असंख्यक,
स्नेहहीन नित कितने दीपक;
जलमय सागर का उर जलता,
विद्युत ले घिरता है बादल!
विहंस विहंस मेरे दीपक जल!
द्रुम के अंग हरित कोमलतम,
ज्वाला को करते हृदयंगम;
वसुधा के जड़ अंतर में भी,
बंदी है तापों की हलचल!
बिखर बिखर मेरे दीपक जल!
मेरी निश्वासों से द्रुततर,
सुभग न तू बुझने का भयकर;
मैं अंचल की ओट किये हूँ ,
अपनी मृदु पलकों से चंचल!
सहज सहज मेरे दीपक जल!

*చూడు వెలుగుతున్నాయి ఎన్నెన్ని దీపాలు,*
*ఆకసాన స్నేహమన్నది లేకుండ*
*నిత్యం ఎన్నెన్ని దీపాలు,*
*రగులుతుంది జలమయ సాగర హృదయం,*
*ఆవరిస్తుంది విద్యుత్తు నింపుకుని నీరదం !*
*నవ్వి నవ్వి*
*వెలుగుము నా దీపమా!*
*హరిత వర్ణాల తరుశాఖల కోమల అంగాలు,*
*నింపుకుని ఉన్నాయి గుండె నిండుగ*
*అంగార జ్వాలలు;*
*జడమే అయినను భూమి గుండియెనందు,*
*భగభగల భాస్వరం మరి అయింది బందీ!*
*అలుముకుని అలుముకుని*
*వెలుగుము నాదీపమా!*
*చక్కదనపు సౌభాగ్యదీపమా!*
*నా జోరు జోరు ఊపిరులకు*
*ఆరిపోవుదునని జడియకుమా!*
*చెఱగు చాటున ఉంచినాను,*
*అతిమెత్తని కదలాడు కనుఱెప్పలతో*
*సహజ సహజముగ*
*వెలుగుము నాదీపమా !*

सीमा ही लघुता का बन्धन,
है अनादि तू मत घड़ियाँ गिन;
मैं दृग के अक्षय कोषों से-
तुझ में भरती हूँ आँसू जल!
सजल सजल मेरे दीपक जल!

तम असीम तेरा प्रकाश चिर,
खेलेंगे नव खेल निरंतर;
तम के अणु अणु में विद्युत सा-
अमिट चित्र अंकित करता चल!
सरल सरल मेरे दीपक जल!

तू जल जल जितना होता क्षय,
वह समीप आता छलनामय;
मधुर मिलन में मिट जाना तू -
उस की उज्ज्वल स्मित में घुलमिल!
मदिर मदिर मेरे दीपक जल!
प्रियतम का पथ आलोकित कर!

***

లఘుత్వ బంధనం మరి పరిమితే,
అనాదివి నీవు గణించకు ఘడియలు ;
నాచక్షువుల అక్షయనిధుల నేత్రజలం
నింపుతాను నీ లోపల !
చెమర్చి చెమర్చి
వెలుగుము నాదీపమా!

అంతులేనిది అంధకారం
శాశ్వతం నీ ప్రకాశం
ఆడతాయి అపురూపపు ఆట అహర్నిశం ;
అంధకారం అణువణువున నిండిన అశనివలె –
చిత్రిస్తూ చెరగని చిత్రాలు సాగిపోవే !
సాదా సాదాగా
వెలుగుము నాదీపమా!

వెలిగి వెలిగి కరిగిన కొలది,
చేరుతాడు చేరువకు
కపట వ్యామోహి ;
మధురమేళనమందు
మిసమిసల మందస్మిత మందు
కరిగి కలిసి ఆనందించవే!
మత్తిల్లి మత్తిల్లి
వెలుగుము నా దీపమా!
నింపుము వెలుగులు
ప్రియుని మార్గాన!

***

14

वे मुस्काते फूल, नहीं -
जिन को आता है मुरझाना,

वे तारों के दीप, नहीं -
जिन को भाता है बुझ जाना;

वे नीलम के मेघ, नहीं -
जिन को है घुलजाने की चाह,

वे अनंत ऋतुराज, नहीं -
जिस ने देखी जाने की राह;

वे सूने से नयन, नहीं -
जिन में बनते आँसू मोती,

वह प्राणों की सेज, नहीं -
जिस में बेसुध पीड़ा सोती;

## 14

కావవి –
చిరునవ్వుల పువ్వులు
వాడుట రానివవి;

కావవి–
తారకల దివ్వెలు
ఆరిపోవుట మెచ్చవవి;

కావవి–
నల్లని మబ్బులు
కరిగిపోవుట కోరవవి;

కాదది–
అనంత ఋతురాజ్యం,
కానలేదది
వెనుకకు మరలే మార్గం;

కావవి–
శూన్య నయనాలు
ఏర్పడవక్కడ
అశ్రువుల ఆణిముత్యాలు;

కాదది–
ప్రాణం పానుపు
నిద్రించదక్కడ
ఒడలు ఎరగని బాధ;

ऐसा तेरा लोक, वेदना
नहीं, नहीं जिस में अवसाद,

जलना जाना नहीं, नहीं
जिस ने जाना मिटने का स्वाद!

क्या अमरों का लोक मिलेगा
तेरी करुणा का उपहार?

रहने दे हे देव! अरे
यह मेरे मिटने का अधिकार!

***

*అటువంటి నీ లోకం, లేవు*
*వెతలు, లేదక్కడ వేదన*
*తెలియదక్కడ రగులుట*
*ఎరగదది*
*రూపుమాయుట*
*ఆ రుచి తెలియదక్కడ!*

*లభిస్తుందా*
*అమరుల లోకం?*
*నీ కరుణ బహుమానం*
*ఉండనీయవయ్యా !*
*మరణించి నశించే*
*నా ఈ అధికారం!*

***

15

विरह की घड़ियां हुई अलि
मधुर मधु की यामिनी सी!

दूर के नक्षत्र लगते पुतलियों से पास प्रियतर,
शून्य नभ की मूकता में गूंजता आह्वान का स्वर,
आज है निस्सीमिता
लघु प्राण की अनुगामिनी सी!

एक स्पन्दन कह रहा है अकथ युग युग की कहानी;
हो गया स्मित से मधुर इन लोचनों का क्षार पानी;
मूक प्रति निश्वास है
नव स्वप्न की अनुरागिनी सी!

सजनि! अंतर्हित हुआ है 'आज' में धुंधला विफल 'कल'
हो गया है मिलन एकाकार मेरे विरह में मिल;
राह मेरी देखती
स्मृति अब निराश पुजारिनी सी!

फैलते हैं सान्ध्य नभ में भाव ही मेरे रंगीले;
तिमिर की दीपावली है रोम मेरे पुलक गीले;
बंदिनी बन कर हुई
मैं बन्धनों की स्वामिनी सी!

***

15

అయినాయే విరహ ఘడియలు చెలి
తీసి తేనియల రాతిరి వలె !
దవ్వుల తారకలు తోస్తాయి ప్రీతిగ
కనుపాపల వలె చేరువగ,
మారుమ్రోగుతుంది శూన్యగగన మౌనమందు
పిలుపు పలుకు,
అయింది ఈ దినాన అనంతత్వం
లఘు ప్రాణాల అనుగామిని వలె !
చెపుతుంది ఒక చిరుకదలిక
చెప్పని యుగయుగాల కథ ;
చిరునవ్వువలె
ఈ కనుల క్షారపు నీరు తీయనయినది ;
ప్రతి ఊపిరి మూగదయినది
క్రొత్త కలల అనురాగినివలె!
ప్రియా! అదృశ్యమయింది ఈ 'దినాన'.
మసకబారిన పరాజిత 'గతదినం'
మిళితమై నావిరహమందు మేళనం
అయిపోయింది ఏకరూపిగ!
ఇక ఈ క్షణాన ఎదురుచూస్తోంది స్మృతి
నిరాశ చెందిన పూజారిణివలె!
నాప్రియభావాలే పరుచుకుంటాయి
సాంధ్య గగనం పయిన ;
అంధకార దీపావళులు
నా ఆర్ద్ర రోమాంచితాలు ;
అయ్యాను నేను బందీనై
బంధనాల స్వామినివలె !

***

16

विरह का जलजात जीवन, विरह का जलजात!

वेदना में जन्म, करुणा में मिला आवास;
अश्रु चुनता दिवस इस का, अश्रु गिनती रात!
जीवन विरह का जलजात!

आँसुओं का कोष उर, हग अश्रु की टकसाल;
तरल जल-कण से बने घन सा क्षणिक मृदु गात!
जीवन विरह का जलजात!

अश्रु से मधुकण लुटाता आ यहाँ मधुमास;
अश्रु ही की हाट बन आती करुणा बरसात!
जीवन विरह का जलजात!

काल इस को दे गया पल-आँसुओं का हार;
पूछता इस की कथा निश्वास ही में वात
जीवन विरह का जलजात!

जो तुम्हारा हो सके लीला कमल यह आज;
खिल उठे निरूपम तुम्हारी देख स्मित का प्रात!
जीवन विरह का जलजात!

***

16

*విరహ జలజాతం జీవనం, విరహ జలజాతం !*

*వేదనయందు జననం, కరుణయందు నివాసం;*
*పగలు అశ్రుచయనం రాతిరి అశ్రు గణనం !*
*జీవనం విరహ జలజాతం!*

*కనులు కన్నీటి టంకశాల, హృదయం కన్నీటి కోశాగారం;*
*అయింది అంబుధరంవలె కదలాడు తుంపరతో క్షణకాలం మృదుదేహం!*
*జీవనం విరహజలజాతం!*

*ఇచటకు వచ్చి దోచుకుంటుంది అశ్రువులతో మధుకణం వసంతం;*
*వస్తుంది అశ్రువుల సంతగా దయనీయ వర్షాకాలం !*
*జీవనం విరహ జలజాతం !*

*దీనికి లిప్తాశ్రువుల మాలను ఇచ్చి వెళ్లింది కాలం ;*
*అడుగుతుంది దీని కథను ఊపిరిలోనే అనిలం!*
*జీవనం విరహ జలజాతం !*

*అవగలగాలి ఈ దినాన నీదే ఈ లీలా కమలం ;*
*అనన్య! చూసి వికసించాలి నీ స్మిత నిశాంతం*
*జీవనం విరహ జలజాతం !*

***

17

कुमुद-दल से वेदना के दाग को
पोंछती जब आंसुओं से रश्मियाँ,
चौंक उठतीं अनिल के निश्वास छू
तारिकायें चकित सी अनजान सी;

तब बुला जाता मुझे उस पार जो
दूर के संगीत सा वह कौन है?

शून्य नभ पर उमड़ जब दुःख भार सी
नैश तम में, सघन छा जाती घटा,
बिखर जाती जुगुनुओं की पांति भी
जब सुनहले आँसुओं के हार सी;

तब चमक जो लोचनों को मूंदता
तड़ित की मुस्कान में वह कौन है?

## 17

**కు**ముద దళాల వేదనల మరకను
కన్నీటితో కిరణాలు
తుడిచిన సమయాన,
గాలి ఊపిరులు
తాకిన సమయాన
తారకలు చకితల వలె
తెలియని వారివలె
త్రుళ్లి పడిన సమయాన ;

సుదూర సంగీతమువలె
ఆవలి తీరము నుండి
పిలుస్తాడే నన్ను
ఎవడు వాడు?

శూన్యగగనాన దుఃఖభారమువలె
రాతిరి చీకటులందు ఎగసిపడి
నల్లని మబ్బు చిక్కబడి
పరుచుకున్న సమయాన,
మిణుగురుల వరుసలూ
స్వర్ణాశ్రువుల మాలికలవలె
చెదిరి పోయిన క్షణాన ;

మెరసి తళుక్కుమని
మెరుపు మందస్మితంతో
మూస్తాడే నా కనులు
ఎవడువాడు?

अवनि-अम्बर की रूपहली सीप में
तरल मोती सा जलधि जब कांपता,
तैरते घन मृदुल हिम के पुंज से
ज्योत्सना के रजत पारावार में;

सुरभि बन जो थपकियाँ देता मुझे
नींद के उच्छवास सा, वह कौन है?

जब कपोल - गुलाब पर शिशु प्रात के
सूखते नक्षत्र जल के बिन्दु से,
रश्मियों की कनक-धारा में नहा
मुकुल हंसते मोतियों का अर्घ्य दे;

स्वप्न-शाला में यवनिका डाल जो
तब हगों को खोलता वह कौन है?

***

అవని అంబరపు వెండి ముత్తెపు చిప్పయందు
కడలి కదలాడు ముత్తెమువలె
కంపించు సమయాన,
వెండి వెన్నెల కడలియందు
మృదు హిమపుంజమువలె
మబ్బులు తేలియాడు సమయాన,

పరిమళమై
నిద్రలోని నిశ్వాసమువలె,
జోకొట్టుతాడేనన్ను
ఎవడువాడు?

ప్రాతఃశిశు గులాబి కపోలాలపయిన
నక్షత్రాలు నీటి బిందువులవలె
ఇంకిన సమయాన,
కిరణాల పుత్తడివెల్లువనందు
ముత్తెముల అర్ఘ్యమునిచ్చి
మొగ్గలు నవ్విన వేళ,

స్వప్న-శాల యవనిక దించి
కనులను తెరుస్తాడే
ఎవడువాడు?

***

18

जयदेव के गीत गोविंद के सुप्रसिद्ध श्लोक का महादेवी जी का अनुवाद

तिमिराच्छन्न गगन को
करते घिरते
आते हैं यह बादल,
घन तमाल
वृक्षों की
छाया में वन-भू
लगती है श्यामल।
यमुना तट के
कुंज पथों पर
जो चल देते
स्नेह मुग्धमन,
उन दोनों
राधा-माधव की
जयति सदा
मधु क्रीड़ा पावन।

***

## 18

జయదేవుని గీతగోవిందంలోని ప్రసిద్ధ శ్లోకానికి
మహాదేవి వర్మగారు చేసిన అనువాదం..

ముసురుకు వస్తున్నాయి
చిక్కటి మబ్బులు
చీకటితో
చదలను మూసేస్తూ
కానవస్తోంది
కాంతార ప్రాంతం
నల్లగా కిక్కిరిసిన
తమాల ద్రుమాల
నీడతో
విహరిస్తున్నాయి
యమునా తీర
పొదల దారులలో
స్నేహముగ్ధ
మానసాలు
పవిత్రం
సతతమధుక్రీడ
ఆ ఇరువురికీ
రాధామాధవులకు
జేజేలు.

***

19

कह दे माँ क्या अब देखूँ!

देखूं खिलती कलियाँ या
प्यासे सूखे अधरों को,
तेरी चिर यौवन-सुषमा
या जर्जर जीवन देखूँ!

देखूं हिम-हीरक हंसते
हिलते नीले कमलों पर,
या मुरझाई पलको से
झरते आँसू-कण देखूँ!

सौरभ पी पी कर बहता
देखूँ यह मंद समीरण,
दुःख की घूँटें पीती या
ठंड़ी साँसों को देखूँ!

खेलूँ परागमय मधुमय
तेरी वसंत-छाया में,
या झुलसे सन्तापों से
प्राणों का पतझर देखूँ!

**19**

చెప్పమ్మా ఇప్పుడు దేనిని చూడను?
విప్పారుతున్న మొగ్గలను చూడనా!

దప్పికతో తడి ఆరిన పెదవులనా,
నీ శాశ్వత యౌవ్వన శోభను చూడనా,
శిథిల జీవనాలను చూడనా!

నల్లకలువల పయిన నవ్వుతు కదలాడే
రజనీ జల రవ్వలను చూడనా,
వడలిన కనుతెప్పల రాలిపడే
కన్నీటి చుక్కలను చూడనా!

నెత్తావులు తాగితాగి నెమ్మదిగావీచే
ఈ పిల్ల తెమ్మెరను చూడనా,
మరి వెక్కులను దిగమింగే
నిట్టూర్పులను చూడనా!

నీ మధుపరాగ వసంత ఛాయనే
విహరించనా,
మరి వడలిన వంతల
జీవన హేమంతం చూడనా!

मकरंद-पगी केसर पर
जीती मधु-परियाँ ढूँढूँ ,
या उर-पंजर में कण की
तरसे जीवन-शुक देखूँ!

कलियों की घन जंगल में
छिपती देखूँ लतिकायें,
या दुर्दिन के हाथों में
लज्जा की करूणा देखूँ!

बहलाऊँ नव किसलय के -
झूले में अलि-शिशु तेरे,
पाषाणों में मसले या
फूलों से शैशव देखूँ!

तेरे असीम आंगन की
देख जगमग दीवाली,
या इस निर्जन कोने के
बुझते दीपक को देखूँ!

మకరంద కేసరాల పయిన
తేనె-అచ్చరలను పరికించనా,
మరి మానస పంజరమున
తండులములకు తహతహలాడే
జీవన కీరమును చూడనా!

మొగ్గల గుబురు అడివియందు,
దాగిన వల్లరులు చూడనా,
మరి చెడు రోజుల చేతులందు
సిగ్గిల్లే కరుణను చూడనా!

నీ అళి - శిశువును
క్రొత్త చిగురుల ఊయలలో
హాయిగా మురిపించనా?
మరి పాషాణాల నడుమ నలిగే
పూవుల శైశవాన్ని చూడనా!

నీ అనంత దేహళి యందు
తళతళల దీపావళిని చూడనా?
మరి ఈ మూల ఒంటరిగా
ఆరిపోయే దీపాన్ని చూడనా?

देखूँ विहगों का कलरव
घुलता जल की कल कल में,
निस्पन्द पड़ी वीणा से
या बिखरे मानस देखूँ!

मृदु रजत-रश्मियाँ देखूँ
उलझी निद्रा-पंखों में
या निर्निमेष पलकों में
चिंता का अभिनय देखूँ!

तुझ में अम्लान हंसी है
इस में अजस्त्र आँसू-जल,
तेरा वैभव देखूँ या
जीवन का क्रन्दन देखूँ!

***

*నీటి గలగలల యందు*
*కలిసిపోయే*
*విహంగాల కలరవాన్ని చూడనా?*

*మరి కదలిక లేని వీణతో*
*చెదిరిన మనసును చూడనా?*

*నిద్ర – పక్షములందు చిక్కుకున్న*
*మృదు రజత – ప్రభలను చూడనా?*
*నిర్నిమేష నయన పుటములందు*
*మరి దుఃఖాభినయం చూడనా?*

*నీయందు మాయని దరహాసం*
*దీని యందు ఎల్లవేళల కన్నీరు*
*నీ సొంపును చూడనా?*
*మరి బ్రతుకు ఏడుపు చూడనా?*

***

20

**क्या** पूजन क्या अर्चन रे?

उस असीम का सुन्दर मंदिर मेरा लघुतम जीवन रे!
मेरी श्वासें करती रहती नित प्रिय का अभिनंदन रे!
पदरज को धोने उमड़े आते लोचन में जल-कण रे!
अक्षत पुलकित रोम, मधुर मेरी पीड़ा का चन्दन रे!
स्नेह भरा जलता है झिलमिल मेरा यह दीपक-मन रे!
मेरे हग के तारक में नव उत्पल का उन्मीलन रे!
धूप बने उड़ते जाते हैं प्रतिपल मेरे स्पन्दन रे!
प्रिय प्रिय जपते अधर, ताल देता पलकों का नर्तन रे!

***

## 20

*పూజలేలా అర్చన లెందుకురా?*

*అనంతుని అందాల ఆలయం నాబుజ్జి బ్రతుకేరా!*

*ప్రియునికి ప్రతినిత్యం పలుకుతాయి స్వాగతాలు నా ఊపిరులేరా!*

*పాద ప్రక్షాళనకు కనులనిండుగ నీరు నిండుకు వస్తుందిరా!*

*నా పులకిత రోమాలు అక్షతలూ తీయని నా వేదన చందనంరా!*

*నిండు స్నేహంతో తళతళల నా మనోదీపం వెలుగునురా!*

*నా కనుపాపల యందు నవ్య కమల వికసన రా!*

*ప్రతిక్షణం నా స్పందనలు ధూపమై ప్రసరించునురా!*

*ప్రియాప్రియా అని చేస్తాయి జపం నా అధరాలు*

*నా కనురెప్పల నర్తనం తాళం వేస్తుందిరా!*

***

21

घोर तम छाया चारों ओर
घटायें घिर आयी घन घोर;
वेग मारूत का है प्रतिकूल
हिले जाते हैं पर्वतमूल
गरजता सागर बारम्बार,
कौन पहुँचा देगा उस पार?

तरंगें उठी पर्वताकार
भयंकर करतीं हाहाकार;
अरे उनके फेनिल उच्छवास
तरी का करते हैं उपहास,
हाथ से गई छूट पतवार,
कौन पहुँचा देगा उस पार?

ग्रास करने तरणी, स्वच्छन्द
घूमते फिरते जलचर-वृन्द;
देखकर काला सिन्धु अनंत
हो गया हा साहस का अन्त!
तरंगें हैं उत्ताल अपार,
कौन पहुँचा देगा उस पार?

**21**

*పరుచుకున్నాయి నలుదిశల చిక్కని నల్లని చీకటులు*
*క్రమ్ముకు వచ్చాయి కారు మబ్బులు;*
*లేవు అనుకూలంగా వీస్తున్న గాలులు,*
*కదిలిపోతున్నాయి పర్వత పాదాలు;*
*హోరెత్తుతున్నాయి పడిపడి కదలి తరంగాలు!*
*ఎవరు చేరుస్తారు ఆవలి ఒడ్డుకు?*

*కొండల్లా లేస్తున్నాయి తరంగాలు,*
*చేస్తున్నాయి భయంకర హాహాకారాలు,*
*అయ్యో, నురగల ఉచ్ఛ్వాసాలు!*
*తెప్పని చూసి చేస్తున్నాయి వెటకారాలు!*
*జారిపోయాయి చేతిలోని తెడ్డులు,*
*ఎవరు చేరుస్తారు ఆవలి ఒడ్డుకు ?*

*తిరుగుతున్నాయి స్వేచ్ఛగా జలచర సమూహాలు,*
*చూస్తున్నాయి తెప్పని కబళించాలని;*
*చూసి అంతులేని నల్లని సాగరాన్ని,*
*ఉడిగిపోయాయి అయ్యొయ్యో ధైర్యసాహసాలు!*
*వేనవేలు ఉవ్వెత్తు తరంగాలు,*
*ఎవరు చేరుస్తారు ఆవలి ఒడ్డుకు?*

बुझ गया वह नक्षत्र-प्रकाश
चमकती जिस में मेरी आश;
रैन बोली सज कृष्ण दूकूल
विसर्जन करो मनोरथ-फूल;
न लाये कोई कर्णधार,
कौन पहुँचा देगा उस पार?

सुना था मैंने इस के पार
बसा है सोने का संसार,
जहाँ के हँसते विहग ललाम
मृत्यु-छाया का सुनकर नाम!
धरा का है अनन्त श्रृंगार,
कौन पहुँचा देगा उस पार?

जहाँ के निर्झर नीरव गान
सुना करते अमरत्व प्रदान;
सुनाता नभ अनन्त झंकार
बजा देता है सारे तार;
भरा जिस में असीम सा प्यार,
कौन पहुँचा देगा उस पार?

ఆరిపోయాయి ఆ నక్షత్ర కాంతులు,
మెరుస్తాయి వాటియందు నా ఆశలు;
చెప్పింది రాతిరి ధరించి నల్లని దుస్తులు,
త్యజించు మనోరథ - పుష్పాలు;
తీసుకురాకు సరంగు లెవరిని,
ఎవరు చేరుస్తారు ఆవలి ఒడ్డుకు?

విన్నాను నేను అవతలి ఒడ్డున
ఉన్నదట బంగారులోకం,
అచట పడిపడి నవ్వుతాయట!
మృత్యువు మాట విని
అందచందాల విహంగాలు!
ఆ నేలంతా అనంత శృంగారాలు,
ఎవరు చేరుస్తారు ఆవలి ఒడ్డుకు?

అచట నిర్ఝరుణుల నిశ్శబ్ద గానాలు,
అమరత్వ ప్రదానాలు;
మీటుతుంది అన్ని తంత్రులు;
విహాయసం వినిపిస్తుంది అనంత ఝంకృతులు
అచట నిండి ఉందిట అంతులేని ప్రేమ,
ఎవరు చేరుస్తారు ఆవలి ఒడ్డుకు?

पुष्प में है अनन्त मुस्कान
त्याग का है मारूत में गान;
सभी में है स्वर्गीय विकास,
वही कोमल कमनीय प्रकाश;
दूर कितना है वह संसार!

कौन पहुँचा देगा उस पार?
सुनाई किस ने पल में आन
कान में मधुमय मोहक तान?
'तरी को ले जाओ मंझधार
डूब कर हो जाओगे पार;
विसर्जन ही है कर्णाधार,
वही पहुँचा देगा उस पार!'

***

*పూవుల్లో చెరగని చిరునవ్వులు,*
*గాలుల్లో త్యాగాల పాటలు;*
*అన్నిటా అలౌకిక వికాసాలు*
*కోమల కమనీయ కాంతులు;*
*ఎంత దూరమా లోకం!*
*ఎవరు చేరుస్తారు ఆవలి ఒడ్డుకు?*

*చిటికలో చెవిలో పాడారు ఎవరో,*
*మధుర మోహనరాగం;*
*'తీసుకెళ్ళు తెప్పని ప్రవాహ మధ్యానికి*
*మునిగి చేరుతావు ఆవలి ఒడ్డుకు;*
*పరిత్యాగమే సరంగు,*
*అదే చేరుస్తుంది ఆవలి ఒడ్డుకు!'*

***

## 22

जाग जाग सुकेशिनी री!
अनिल ने आ मृदुल हौले,
शिथिल वेणी-बन्ध खोले,
पर न तेरे पलक डोले,
बिखरती अलकें झरे जाते
सुमन परवेषिनी री!

छाँह में अस्तित्व खोये,
अश्रु से सब रंग धोये,
मंदप्रभा दीपक संजोये,
पन्थ जिसका देखती तू अलस
स्वप्न-निमेषिनी री!

रजत-तारों से घटा बने,
गगन के चिर दाग गिन गिन,
श्रान्त जग के श्वास चुन चुन,
सो गयी क्या नींद का अज्ञात -
पथ-निर्देशिनी री!

## 22

మేలుకో! మేలుకో! ఓ సుకేశినీ!
చల్లచల్లగా నెమ్మదినెమ్మదిగా వచ్చాడు అనిలుడు
విప్పాడు జారిన జుట్టు ముడి
విడలేదే నీ కనురెప్పలు,
చెదిరిపోతాయి ముంగురులు
జారిపోతాయి కుసుమాలు
ఓ పరవేషినీ!

అస్తిత్వాన్ని ఛాయ యందు జారవిడుచుకొని
అశ్రువులందు సమస్త వర్ణాలను ప్రక్షాళించుకొని
చిరువెలుగుల దీపం చేత బట్టి
అలసిసొలసి ఎదురుతెన్నులు చూస్తున్నావు ఎవరి కొరకు?
ఓ స్వప్న నిమేషినీ!

రజత–తారకలతో మబ్బులను నేసి,
గగనపు చెరగని చిహ్నాలను గణించి గణించి
అలసిసొలసిన లోకపు ఊపిరులు ఎంపిక చేసి
నిద్రించావా తెలియని ఎరగని నిద్రయందు?
ఓ పథ ప్రదర్శినీ!

दिवस की पद-चाप चंचल,
भ्रांति में सुधि सी मधुर चल,
आ रही है निकट प्रतिपल,
निमिष में होगा अरुण जग
ओ विराग-निवेशिनी री!

रूप-रेखा-उलझनों में,
कठिन सीमा-बन्धनों में;
जग बन्धा निष्ठुर क्षणों में;
अश्रुमय कोमल कहाँ तू
आ गयी परदेशिनी री!

***

*పగటి పాదధ్వని చంచలం,*
*ముద్దుముద్దుగా నడిచినడిచి*
*భ్రమయందలి చైతన్యం వలె,*
*వస్తోంది సమీపానికి క్షణక్షణం,*
*ఇహ నిమిషమందు జగం అరుణం!*
*ఓ విరాగ నివేశినీ!*

*రూపు, రేఖల కట్టడుల యందు,*
*కఠిన హద్దుల బంధనముల యందు,*
*నిర్దయ ఘడియలందు*
*బంధించబడింది జగత్తు;*
*ఓ కన్నీటి కోమలీ ఎచటకు వచ్చావు నీవు*
*ఓ పరదేశినీ!*

***

23

आज सुनहली बेला!
आज क्षितिज पर जांच रहा है तूली कौन चितेरा?
मोती का जल सोने की रज विद्रुम का रंग फेरा!

क्या फिर क्षण में,
सान्ध्य गगन में,
फैल मिटा देगा इस को
रजनी का श्वास अकेला?

लघु कंठों के कलरव से ध्वनिमय अनंत अम्बर है,
पल्लव बुद्‌बुद्‌ और गले सोने का जग सागर है;
शून्य अंक भर -
रहा सुरभि-उर;
क्या सूना तम भर न सकेगा
यह रागों का मेला!

## 23

*సువర్ణ సమయం ఈనాడు!*
*సరి చూసుకుంటున్నాడు క్షితజంపయిన తూలికను,*
*ఏ చిత్రకారుడు నేడు?*
*ముత్యపు జలం స్వర్ణ రజం విద్రుమ వర్ణం*
*కలిపాడు ఆవర్తాలను!*

*మరుక్షణమందు మరి దీనిని సాంధ్య గగనమందు,*
*తుడిచివేస్తాయా కేవలం రాతిరి ఊపిరులు?*

*చిరుగళాల కలరవం నిండింది ధ్వనులతో అనంతాంబరం*
*పల్లవాలు బుద్బుదాలు*
*కంఠమందు బంగారులోకం సాగరం*
*నింపుతూ ఉంది ఒడి శూన్యం సురభి–హృదయం*
*పండించగలదా శూన్య అంధకారం*
*ఈ అనురాగాల సంబరం!*

विद्रूमपंखी मेघ इन्हें भी क्या जीना क्षण भर ही?
गोधूली-तम का परिणय है तम की एक लहर ही!

क्यों पथ में मिल,
युग युग प्रतिपल,
सुख ने दुःख दुःख ने सुख के -
वर अभिशापों को झेला?

कितने भावों ने रंग ड़ाली सूनी साँसें मेरी,
स्मित में नव प्रभात चितवन में सन्ध्या देती फेरी,
उर जलकणमय,
सुधि रंगोंमय,
देखूँ तो तम बन जाता है
किस क्षण वह अलबेला!

***

*పగడపుతెక్కల పయోధరం క్షణమాత్రమేనా వీటి జీవనం?*
*తమస్సు క్షణమాత్రపు ముచ్చటేనా గోధూళి–తిమిర పరిణయం?*

*ఎందుకని మార్గమందు కలిసి యుగయుగాలు ప్రతిక్షణం*
*సుఖం దుఃఖాన్ని దుఃఖం సుఖాన్ని*
*భరిస్తుంది వరంతో శాపంతో!*

*ఎన్నెన్ని భావాలు నింపాయి వర్ణాలు నా శూన్య శ్వాసలు,*
*నవ ప్రభాతం స్మితమందు, సుడులు తిప్పింది సంజ*
*చూపులందు,*
*హృదయం జలకణభరితం,*
*స్మృతి బహువర్ణ శోభితం,*
*చూడాలి మరి ఏ క్షణమందు*
*అవుతుందో తమం సుందరం!*

***

24

रागभीनी तू सजनि निश्वास भी तेरे रंगीले!
लोचनों में क्या मदिर नव?
देख जिस को नीड़ की सुधि फूट निकली बन मधुर रव!
झूलते चितवन गुलाबी-में चले घर खग हठीले!
रागभीनी तू सजनि निश्वास भी तेरे रंगीले!

छोड़ किस पाताल का पुर?
राग से बेसुध, चपल सपने सजीले नयन में भर,
रात नभ के फूल लाई, आँसुओं से कर सजीले!
रागभीनी तू सजनि निश्वास भी तेरे रंगीले!

## 24

*ప్రియా నీవు రాగరంజితం నీ నిశ్వాసం రసమయం!*
*కనుల యందు ఏమా క్రొత్త మైకం?*
*గూడు గుర్తుకు వచ్చి మొదలయింది మధుర కలరవం*
*రాగరక్తిమమందు తూలుతు పట్టింది*
*పెంకిగ గూటి బాట గగనచరం*
*ప్రియా నీవు రాగరంజితం నీ నిశ్వాసం రసమయం!*

*ప్రేమయందు ఒడలు మరిచి, కనులయందు*
*నింపుకొని సుందర చంచల స్వప్నం*
*త్యజించి ఏ పాతాళపురం, తెచ్చావు అంబర ప్రసూనం?*
*రాతిరి అశ్రువులతో తడిపి మనోహరం !*
*ప్రియా నీవు రాగరంజితం నీ నిశ్వాసం రసమయం!*

आज इन तन्द्रिल पलों में!
उलझती अलकें सुनहली असित निशि के कुन्तलों में!
सजनि नीलमरज भरे रंग चुनरी के अरूण पीले!
रागभीनी तू सजनि निश्वास भी तेरे रंगीले!

रेख सी लघु तिमिर लहरी,
चरण छू तेरे हुई है सिन्धु सीमाहीन गहरी!
गीत तेरे पार जाते बादलों की मृदु तरी ले!
रागभीनी तू सजनि निश्वास भी तेरे रंगीले!

कौन छाया-लोक की स्मृति,
कर रही रंगीन प्रिय के द्रुत पदों की अंक संसृति,
सिहरती पलकें किये देती विहंसते अधर गीले!
रागभीनी तू सजनि निश्वास भी तेरे रंगीले!

***

*నేడు ఈ జోగుతున్న మత్తు ఘడియలందు!*
*బంగరు వన్నెల ముంగురులు చిక్కుబడ్డాయి!*
*నల్లని రాతిరి కురుల యందు!*
*నీలవర్ణ రజం నింపింది ప్రియా!*
*పచ్చని ఎఱ్ఱని పయ్యెద రంగుల యందు!*
*ప్రియా నీవు రాగ రంజితం నీ నిశ్వాసం రసమయం!*

*చాలి వంటి చిరు తిమిర తరంగం,*
*స్పృశించి నీ చరణాలు,*
*అయింది అంతులేని సాగరం!*
*మెత్తని మెయిలు తరణి పయిన,*
*చేరతాయి నీ గీతాలు ఆవలితీరం!*
*ప్రియా నీవు రాగ రంజితం నీ నిశ్వాసం రసమయం!*

*ఏ ఛాయా–లోక స్మృతి,*
*చేస్తోంది రసమయం,*
*ప్రియుని ద్రుత చరణాల అంక సంస్మృతి,*
*ఆర్ద్ర పరుస్తాయి నవ్వే అధరాలను*
*కంపిత కనుఱెప్పలు!*
*ప్రియా నీవు రాగ రంజితం నీ నిశ్వాసం రసమయం!*

***

## 25

चुभते ही तेरा अरुण बान
बहते कन कन से फूट फूट
मधु के निर्झर से सजल गान!

इन कनक-रश्मियों में अथाह,
लेता हिलोर तम-सिन्धु जाग,
बुद्‌बुद्‌ से बह चलते अपार,
उस में विहगों के मधुर राग,
बनती प्रवाल का मृदुल कूल,
जो क्षितिज-रेख थी कुहर-म्लान!

नव कुन्द-कुसुम से मेघ-पुंज,
बन गए इन्द्रधनुषी वितान,
दे मृदु कलियों की चटक, ताल,
हिम-बिन्दु नचाती तरल प्राण,
धो स्वर्ण-प्रात में तिमिर-गात,
दुहराते अलि निशि-मूक तान!

25

గ్రుచ్చుకొని నీ అరుణ బాణాలు!
కణకణమున విడివడి,
పరుగులు పెడతాయి తేనెవాగులవలె
ఆర్ద్ర గీతాలు!

లోతు తెలియని ఈ పసిడి వెలుగుల యందు,
ఊయల లూగి తూగుతుంది మేలుకొని ఇరుల కదలి;
దానియందు విహంగాల మధురగానాలు;
తేలి ఆడతాయి నూఱారు బుడగల వలె
కప్పుకొని కుజ్ఝటికను పొగిలిన క్షితిజ రేఖ
అవుతుంది విద్రుమ వర్ణ మృదు తటం!

నవకుంద-కుసుమాల వలె మబ్బుల గుంపులు,
అవుతాయి ఇంద్ర చాపాల చాందినిలు,
విప్పారే మృదు-కలికల సడి, తాళం,
చంచల హిమబిందువుల నర్తనం,
స్వర్ణ ప్రభాతాన అంధకారపు ఒడలు కడిగి,
మరలపాట అందుకుంటాయి భ్రమరాలు
నిశి-మౌన రాగాలు!

सौरभ का फैला केश-जाल,
करती समीर-परियाँ विहार,
गीली केसर-मद झूम-झूम,
पीते तितली के नव कुमार
मर्मर का मधु संगीत छेड़ -
देते हैं हिल पल्लव अजान!

फैला अपने मृदु स्वप्न-पंख,
उड़ गई नींद-निशि क्षितिज पार,
अधखुले हगों के कंज-कोष -
पर छाया विस्मृति का खुमार;
रंग रहा हृदय ले अश्रु-हास,
यह चतुर चितेरा सुधि-विहीन!

***

*పరుచు కుంటాయి సౌరభ కేశ-జాలాలు,*
*విహరిస్తాయి తెమ్మెరల అచ్చరలు;*
*త్రుళ్లి తూగుతు పదుచు సీతాకోకలు,*
*తాగుతాయి తడిసిన కేసర-మదం,*
*తెలిసీ-తెలియక ఊగితూగి పల్లవాలు,*
*వినిపిస్తాయి గలగలల మత్తుగీతాలు!*

*విప్పుకొని తన మృదు స్వప్న-పక్షాలను,*
*ఎగిరిపోయింది నిదుర-నిశి క్షితిజపు ఆవలి తీరం,*
*ఆరమోడ్పు కనుల కమల-కోశం పయిన,*
*పరుచుకొంది విస్మృత నిదుర-మైకం;*
*సర్వం మరిచి నింపుతున్నాడు చతుర చిత్రకారుడు,*
*హృదిని అశ్రు-హాస వర్ణం!*

***

## 26

विश्व जीवन के उपसंहार!

तू जीवन में छिपा वेणु में ज्यों ज्वाला का वास,
तुझ में मिल जाना ही है जीवन का चरम विकास,
पतझर बन जग में कर जाता
नव वसंत संचार!
मधु में भीने फूल प्राण में भर मदिरा सी चाह,
देख रहे अविराम तुम्हारे हिम-अधरों की राह,
मुरझाने के मिस देते तुम
नव शैशव उपहार!

कलियों में सुरभित अपने मृदु आंसू अवदात,
तेरे मिलन-पंथ में गिन-गिन पग रखती है रात,
नव छवि पाने हो जाती मिट
तुझ में एकाकार!

क्षीण शिखा से तम में लिख बीती घड़ियों के नाम,
तेरे पथ में स्वर्णरेणु फैलाता दीप ललाम,
उज्ज्वलतम होता तुझ से ले
मिटने का अधिकार!



యాత్రాంతం

26

*విశ్వజీవన ఉపసంహారం!*
*జీవనమందు దాగి యున్నావు నీవు*
*వేణువునందు జ్వాల దాగిన విధాన,*
*నీయందు లీనమవడం*
*జీవన చరమ వికాసం,*
*జగత్తునందు హేమంతమై*
*చేస్తావు నవ వసంత సంచారం!*
*మకరంద భరిత పుష్పాలు*
*నింపుకొని హృది నిండుగ*
*మధువు వంటి కోరికలు,*
*చూస్తున్నాయి ఎదురుతెన్నులు*
*నీ హిమ-అధరాల కొరకు!*
*వాడినవను మిషను*
*ప్రసాదిస్తావు నవశైశవ పురస్కారం!*

*కలికల యందు సురభిని నింపి*
*ఉజ్జ్వల కోమల అశ్రువులు,*
*లెక్కపెడుతుంది రాతిరి*
*తన అడుగు అడుగున*
*నీ మేళన-పథము నందు,*
*పొందుటకు క్రొత్త ఛవి*
*నశించిపోతుంది నీ యందు*
*అవుతుంది ఏకాకారం!*

*లిఖిస్తుంది క్షీణకళికతో*
*అంధకారమందు గడిచిన ఘడియలను*
*పరుస్తుంది స్వర్ణరేణువులను*
*నీ మార్గమందు*
*అందమైన దీపం,*
*పొంది నీ నుండి నశించు అధికారం*
*అవుతుంది మరింత ఉజ్జ్వలం !*

धुलनेवाले मेघ अमर जिनकी कण कण में प्यास,
जों स्मृति में है अमिट वही मिटनेवाला मधुमास -
तुझ बिन हो जाता जीवन का
सारा काव्य असार!

इस अनंत पथ में संसृति की सांसें करती लास,
जाती हैं असीम होने मिटकर असीम के पास,
कौन हमें पहुँचाता तुझ बिन
अंतहीन के पार?
चिर यौवन पा सुषमा होती प्रतिमा सी अम्लान,

चाह चाह थक थक कर हो जाते प्रस्तर से प्राण,
सपना होता विश्व हासमय
आँसूमय सुकुमार!

***

కరిగిపోయే మబ్బులు
కణకణమున వాటి తరగని పిపాసలు,
స్మృతి యందు నశించనదే మరి
నశించే మధుమాసం –
నీవు లేని జీవనకావ్యం
సమస్తం సారవిహీనం !

సంసృతి శ్వాసలు
నశిస్తాయి ఈ అనంత పథమందు
అనంతమవాలని
నశించి చేరతాయి అనంతమునకు,
చేరుస్తారు ఎవరు నీవుకాక
మమ్ములను అంతము లేని ఆ తీరం!!

శాశ్వత యౌవ్వనం పొంది
అవుతుంది సుషమ నిర్మల ప్రతిమ చందాన,
అవుతాయి కోరికోరి అలసిఅలసి ప్రాణాలు ప్రస్తర చందాన,
అవుతుంది స్వప్నం సుకుమారం
విశ్వం హాసమయం అశ్రుమయం!

***

27

लय गीत मदिर, गति ताल अमर,
अप्सरि तेरा नर्तन सुन्दर!

आलोक-तिमिर-सित-असित चीर,
सागर-गर्जन रुनझुन मँजीर;
उड़ता झंझा में अलक-जाल,
मेघों में मुखरित किंकिण-स्वर!
अप्सरि तेरा नर्तन सुन्दर!

रवि-शशि तेरे अवतंस लोल,
सीमन्त-जटित तारक अमोल;
चपला विभ्रम, स्मित इन्द्रधनुष,
हिमकण बन झरते स्वेद-निकर!
अप्सरि तेरा नर्तन सुन्दर!

## 27

*లయగీతం మదిరమదం,*
*గతి తాళం అమరం,*
*అప్సర! నీ నర్తనం మనోహరం!*

*ఆలోక - తిమిరాలు సిత-అసిత దుకూలం*
*సాగర గర్జనం ఝనన - ఝనన మంజీరం*
*ఎగురుతాయి ఝంఝ యందు ముంగురులు*
*అప్సర ! నీ నర్తనం మనోహరం!*

*కర్ణములందు కదలాడు*
*అలంకారాలు రవి - శశిలు,*
*సీమంత మందు*
*పొదిగిన విలువైన తారకలు,*
*విభ్రమం మెరుపు,*
*స్మితం ఇంద్రచాపం,*
*హిమ కణములుగ రాలుతుంది*
*స్వేదనికరం!*
*అప్సర! నీ నర్తనం మనోహరం!*

युग है पलकों का उन्मीलन,
स्पन्दन में अगणित लय-जीवन;
तेरी श्वासों में नाच नाच
उठता बेसुध जग सचराचर!
अप्सरि तेरा नर्तन सुन्दर!

तेरी प्रतिध्वनि बनती मधुदिन,
तेरी समीपता पावस-क्षण;
रूपसि छूते ही तुझ में मिट,
जड़ पा लेता वरदान अमर!
अप्सरि तेरा नर्तन सुन्दर!

***

కనురెప్పల వికసనం యుగం,
స్పందన యందు నూఊరు లయ-జీవనం,
నీ శ్వాస యందు నర్తించి నర్తించి
లేస్తుంది కదలిక లేని
చరాచర జగం !
అప్సర ! నీ నర్తనం మనోహరం !

అవుతుంది నీ ప్రతి దినం మధు దినం,
నీ సామీప్యం వర్షణ క్షణం ;
రూపసి! నిను స్పృశించిన క్షణం
లీనమై నీ యందు
పొందుతుంది అమర వరం జడం!
అప్సర ! నీ నర్తనం మనోహరం!

***

28

मेरे हंसते अधर नहीं जग -
की आंसू-लडियाँ देखो!
मेरे गीले पलक छुओ मत
मुर्झाई कलियाँ देखो!

हंस देता नव इन्द्रधनुष की -
स्मित में घन मिटता मिटता;
रंग जाता है विश्व राग से
निष्फल दिन ढलता ढलता;
कर जाता संसार सुरभिमय
एक सुमन झरता झरता;
भर-जाता आलोक तिमिर में

लघु दीपक बुझता बुझता;
मिटनेवालों की है निष्ठुर!
बेसुध रंगरलियाँ देखो;
मेरे गीले पलक छुओ मत
मुर्झाई कलियाँ देखो;

गल जाता लघु बीज असंख्यक
नश्वर बीज बनाने को;
तजता पल्लव वृन्त पतन के
हेतु नये विकसाने को;

## 28

నవ్వుతున్న నా అధరాలను కాదు
లోకపు కన్నీటి - సరాలను చూడు!
తడిసిన నా కనురెప్పలు తాకకు
వాడిన మొగ్గలు చూడు!

నవ్వుతుంది నశిస్తూ నశిస్తూ
మబ్బు నవ ఇంద్రచాప స్మితమందు;
రంజిల్లుతుంది వాలిపోతు వాలిపోతు
వ్యర్థమైన ప్రొద్దు విశ్వరాగం వలన;
వెదజల్లుతుంది పరిమళం రాలిపోతు రాలిపోతు
ఒక కుసుమం జగత్తు నందు;
నింపుతుంది వెలుగు ఆరిపోతూ ఆరిపోతూ
చిరు దీపం చీకట్ల యందు;

చూడవయ్యా ఓ కళకువాడా!
లయమయే వారిని
వారే గుర్తించని
వారి హాయిని ఖులాసాని!
తడిసిన నా కనురెప్పలు తాకకు
వాడిన మొగ్గలు చూడు!

నశించిపోతాయి వేనవేలు చిరు బీజాలు
చేయాలని ఒక నశ్వర బీజం;
త్యజిస్తాయి వృంతాలను పల్లవాలు
రాలి వికసింపజేయాలని నూతనం;

मिटता लघु पल प्रिय देखो
कितने युग कल्प मिटाने को;
भूल गया जग भूल विपुल
भूलोंमय सृष्ठि रचाने को!

मेरे बन्धन आज नहीं प्रिय,
संसृति की कडियाँ देखो!
मेरे गीले पलक छुओ मत
मुर्झाई कलियाँ देखो!

श्वासें कहती 'आता प्रिय'
नश्वास बताते 'वह जाता',
आँखों ने समझा अनजाना
उर कहता चिर यह नाता;
सुधि से सुन 'वह स्वप्न सजीला
क्षण-क्षण नूतन बन जाता';

दुख उलझन में राह न पाता
सुख दृग-जल में बह जाता;
मुझ में हो तो आज तुम्हीं 'मैं'
बन दुख की घड़ियाँ देखो!
मेरे गीले पलक छुओ मत
बिखरी पंखुरियाँ देखो!

***

లయమవుతుంది చూడు ప్రియా చిరు ఘడియ
చేయడానికి లయం ఎన్నెన్ని యుగ కల్పాలు;
మరిచిపోతుంది జగత్తు విపుల దోషాలను
చేయడానికి దోషమయ సృష్టి రచన!

నేడు నా బంధనాలను కాదు ప్రియా!
చూడు సంసృతి శృంఖలాలు!
తడిసిన కనుతెప్పలు తాకకు
వాడిన మొగ్గలు చూడు!

అంటుంది శ్వాస 'వస్తాడు ప్రియుడు'
చెపుతుంది నిశ్వాసం 'వెళ్తాడు అతడు'
తెలియని దానిని తెలుసుకున్నాయి కనులు
చిరకాలపు బంధమిది, చెపుతుంది మనసు;
వస్తుంది స్ఫురణకు ఈ స్వప్నం సుందరం
క్షణక్షణం అవుతుంది నూతనం;

ఇక్కట్టులయందు దారి కానదు విషాదం
నేత్ర-జలము నందు జారిపోవును ఆనందం;
నీవు నాలో ఉంటే నేడు నువ్వు 'నేనై'
విషాద ఘడియలు చూడు!
తడిసిన నా కనుతెప్పలు తాకకు
చెదిరిన పూరేకులను చూడు!

***

29

इस एक बूंद आँसू में
चाहे साम्राज्य बहा दे,
वरदानों की वर्षा से
यह सूनापन बिखरा दो;

इच्छाओं की कम्पन से
सोता एकान्त जगा दो,
आशा की मुस्काहट पर
मेरा नैराश्य लुटा दो!

चाहे जर्जर तारों में
अपना मानस उलझा दो,
इन पलकों के प्यालों में
सुख का आसव छलका दो;
मेरे निखरे प्राणों में
सारी करूणा ढुलका दो,

मेरी छोटी सीमा में
अपना अस्तित्व मिटा दो!
पर शेष नहीं होगी यह
मेरे प्राणों की क्रीड़ा,
तुम को पीड़ा में ढूँढ़ा
तुम में ढूढूँगी पीड़ा!

***

29

*ధార పోయుము సమస్త సామ్రాజ్యాన్ని*
*కావాలనుకుంటే ఒక్క ఈ కన్నీటి చుక్కలో!*
*చెదరగొట్టుము ఈ శూన్యాన్ని*
*వేయి వరాల వర్షంలో!*

*కోరికల అలజడిలో*
*నిద్రిస్తున్న ఏకాంతాన్ని*
*కావాలనుకుంటే*
*మేల్కొలుపుకో!*
*కొల్లగొట్టుము నా నైరాశ్యాన్ని*
*ఆశల చిరునవ్వులతో,*

*చిక్కుకు పోనిమ్ము నీ మానసాన్ని*
*శిథిల తంత్రులలో!*
*పొరలి పడనిమ్ము ఆనందాల ఆసవాన్ని*
*ఈ కనుతెప్పల చషకాలలో!*
*నింపుము యావత్ కరుణను*
*నా చెదరిన ప్రాణాలలో!*

*చెరిపివేసుకొనుము నీ అస్థిత్వాన్ని*
*నా లఘు పరిమితిలో!*
*అయినను అంతం కాదు*
*ఈ నా ప్రాణాల క్రీడ!*
*వెతికాను నిన్ను వెతలో*
*వెతుకుతాను వెతను నీలో!*

***

**30**

**मू**क करके मानस का ताप
सुलाकर वह सारा उन्माद,
जलाना प्राणों को चुपचाप
छिपाये रोता अन्तर्नाद;
कहाँ सीखी वह अद्भुत प्रीति?
मुग्ध हे मेरे छोटे दीप!

चुराया अन्तस्तल में भेद
नहीं तुम को वाणी की चाह,
भस्म होते जाते हैं प्राण
नहीं मुख पर आती है आह,
मौन में सोता है संगीत -
लजीले मेरे छोटे दीप!

क्षार होता जाता है गात
वेदनाओं का होता अन्त,
किन्तु करते रहते हो मौन
प्रतीक्षा का आलोकित पन्थ,
सिखा दो ना नेही की रीति -
अनोखे मेरे नेही दीप!

30

మూగగ చేసి మనోతాపాన్ని
నిద్రపుచ్చి యావత్ ఉన్మాదాన్ని,
దాచుకుని విలపిస్తున్న అంతర్ నాదాన్ని
నిశ్శబ్దంగా జ్వలింప చేయగల ప్రాణాలను,
నేర్చుకున్నావు ఎక్కడ ఈ అద్భుత రీతి?
మోహిత నా చిన్నారి దీపమా!

తెలుసుకుని అంతరంగ రహస్యాన్ని
మాటగ చెప్పే కోరిక లేదు,
బూడిదైపోతూ ఉంటాయి ప్రాణాలు
వెలువడదు ఉస్సురను నిట్టూర్పు,
నిద్రిస్తుంది మౌనంలో సంగీతం-
సిగ్గుమొగ్గల నా చిన్ని దీపమా!

మసి అయిపోతూ ఉంటుంది దేహం
వస్తుంది వెతల అంతం,
అయినను వీక్షిస్తూ ఉంటాయి
ఎదురుచూపుల వెలుగుల దారిని,
నేర్పించవే నెయ్యంపు తీరు-
స్నేహశీలి నా విలక్షణ దీపమా!

पड़ी है पीड़ा संज्ञाहीन
साधना में डूबा उद्‌गार,
ज्वाल में बैठा हो निस्तब्ध
स्वर्ण बनता जाता है प्यार,
चिता है तेरी प्यारी मीत -
वियोगी मेरे बुझते दीप!

अनोखे से नेही के त्याग!
निराले पीड़ा के संसार!
कहाँ होते हो अन्तर्धान
लुटा अपना सोने सा प्यार?
कभी आयेगा ध्यान अतीत -
तुम्हें क्या निर्वाणोन्मुखी दीप?

***

*పడి ఉంది అచేతనంగా వెత*
*మునిగి ఉంది సాధనలో ఉద్గారం,*
*మఠం వేసుకు కూర్చుంది మంటలో స్థబ్దంగా*
*అవుతూ ఉంటుంది ప్రీతి సువర్ణంగా,*
*చితి నీ ప్రియ నెచ్చెలి–*
*వియోగి ఆరిపోయే నా దీపమా!*

*విలక్షణం స్నేహశీలి త్యాగాలు!*
*అపూర్వం వెతల లోకాలు!*
*బంగారం వంటి నీ ప్రీతిని*
*దోపిడికి గురిచేసి*
*ఎక్కడికి మాయమవుతావు*
*గమనంలోకి వస్తుందా నీకు*
*గత స్మృతి ఎప్పుడైనా–*
*ఓ నిర్వాణోన్ముఖి దీపమా!*

***



# Mahādevi Varma Geetālu

A Translation of great modern Hindi Poet
in telugu by CHAGANTI TULASI

'తూ ధూల్ భరా హీ ఆయా!'
గేయాన్ని చక్కటి చిక్కటి తెలుగు
నుడికారంలో అనువదించిన సరళి
వాస్తవంగా అచ్చు తెలుగు జానపదశైలిని
మరిపిస్తుంది.

దారిబత్తెం లేకుండా వదిలేసాయి
అన్ని కలలు
కంచికి వెళ్లకుండా ఒడిలోనే
వుండిపోయాయి
అన్నికథలు
అదిగో అప్పుడు సైగతో పిలిచాయి
ఆ చేలాంచలాలు

– బాలశౌరిరెడ్డి

ప్రేమ యందు ఒడలు మరిచి
కనుల యందు
నింపుకొని సుందరచంచల స్వప్నం
త్యజించి ఏ పాతాళపురం,
తెచ్చావు ఏ అంబర ప్రసూనం
రాతిరి అశ్రువులతో తడిపి మనోహరం
ప్రియా నీవు రాగరంజితం
నీ నిశ్వాసం రసమయం

లాంటి చరణాలు అనువాదస్థాయిని
దాటి స్వతంత్ర తెలుగుకవితగా నిలబడే
స్థాయిని సంతరించుకున్నాయి.

– వాడ్రేవు చినవీరభద్రుడు

ISBN : 978-93-5235-935-6

144 pages

Price : Rs. 130/-

మహా కవయిత్రి మహాదేవివర్మ గీతాలు

తెలుగు అనువాదం : చాగంటి తులసి